శ్రియఃపతయే నమః



# ఆంధ్రహర్షచరిత్ర

(పూర్వభా[illegible]



గ్రంథకర్త
శ్రీమాన్
కొమాండూరు కృష్ణమాచార్యులు
ఆంధ్రగీర్వాణభాషాధ్యాపకుఁడు
ఆంధ్రక్రైస్తవ కళాశాల
గుంటూరు







వెల రు 1-4-0.

# పరిచయము



"ఆంధ్రహర్ష చరిత్ర" ప్రౌఢప్రబంధముగా రచించిన విద్వత్కవులు శ్రీమాన్ కోమాండూరి కృష్ణమాచార్యులు గారు ఆంధ్రవిద్వల్లోకమునకు అపరిచితులు కారు. వీరు సనాతనసంప్రదాయానుసారముగా, చాలావరకు స్వయంకృషి వల్లనే, సంస్కృతాంధ్రభాషా వాఙ్మయములలో అసామాన్య పాండిత్యము సంపాదించినారు. ఆంగ్లకళాశాలలలో ఆంగ్ల భాషాపాండిత్యమూ, పాశ్చాత్యసారస్వతపరిజ్ఞానమూ అలవర్చుకొన్నారు. 'సాహితీసమితి' సభ్యులుగా ఉండి నవ్య సాహిత్యమునకు దోహద మిచ్చినవారిలో ఒకరయినారు. కనుక వీరికృతులలో ప్రాచ్యపాశ్చాత్య, ప్రాచీన నవీనకవితా రీతుల సమ్మేళనముగాని ఆయారీతులఛాయలుగాని కనబడవలసి ఉండగా ప్రకృతగ్రంథము ఆమూలాగ్రము కేవలసంప్రదాయసిద్ధ మైనప్రబంధమార్గము నవలంబించిమాత్రమే వ్రాయబడినట్లు వ్యక్తమవుతూ ఉన్నది. ఇది స్వతంత్ర గ్రంథముకాక బాణకవి సంస్కృతములో ఆఖ్యాయికగా రచించిన హర్షచరిత్రకు అనువాద మగుటవల్లనూ, పద్యాత్మకముగా వ్రాయవలెనంటే ప్రబంధశక్తిమాత్రమే అందుకు అనువుగా ఉండుటవల్లనూ కవిగా రీపద్ధతి అవలంబించి, తమ నవ్యసాహిత్యకళాదృష్టిని ప్రాచీనమార్గములో ఇప్పటివారికి అసంగతములుగా కనబడేవిషయములు తొలగించుటకూ, మూలగ్రంథములోని విషయములను సముచితరీతిని పేర్చి

కూర్చుటకూమాత్రమే వినియోగించి ఈప్రౌఢప్రబంధము రచించినట్లు గోచరిస్తున్నది.

బాణకవి గడుసుపోకడలకూ, చిత్రవిచిత్రగతులకూ ఎత్తుగడలకూ ఈకవిగారి ఆంధ్రీకరణములో మెరుగువచ్చినది. గ్రంథములోనిభాష ప్రౌఢసాంస్కృతికప్రయోగములతోనూ, సుదీర్ఘ సమాసములతోనూ కూడుకొని ఉన్నప్పటికీ సరళము గా, శ్రావ్యముగా, సంతతప్రవాహముగా నడుస్తూ ఉండ డమువల్ల చదువరులకు ఆయాసముకాక ఆమోదమే కలిగి స్తున్నది. ఈకావ్యములో ప్రయుక్తములయిన వివిధవృత్త ములూ, ఆయా పద్యములలోనివివిధము లగునడకలూ కవన మల్లుటలో ఈకవిగారు సిద్ధహస్తులని తెలుపుతున్నవి.

ప్రాచీనకవు లెవ్వరూ హర్షచరిత్రము ఆంధ్రప్రబంధ ముగా రచించుటకు పూనుకొనక, ఆభారమూ గౌరవమూ కూడా ఈ కవిగారికి విడిచిపెట్టుట ఆంధ్రులభాగ్యమని భావింపవలసినంత మనోహరముగా కావ్యనిర్మాణముచేసిన శ్రీమాన్ కృష్ణమాచార్యులుగారు ఆంధ్రులగౌరవాదరము లకు పాత్రులు. వీరచిరకాలములో దీనిద్వితీయభాగము కూడా ప్రకటించి దేశీయులకృతజ్ఞతకు పాత్రులగుదురుగాక

# పీ ఠి క

శ్రీపతి ర్భగవా న్పృష్ట్వా ద్భక్తానాం న స్సమీహితమ్
యద్భక్తి శ్శుల్కతా మేతి ముక్తికన్యాకరగ్రహే.

సంస్కృతవాఙ్మయములో నున్నకావ్యము లన్నియుఁ బద్యకావ్యములే కాని గద్యకావ్యములు మృగ్యములు. వ్యాకరణతర్కవేదాంతమీమాంసాదిశాస్త్రములు వచనరూపముగా వ్రాయఁబడియున్నను వానికి గద్యకావ్యత్వవ్యవహారము లేదు. "రసాత్మకం వాక్యం కావ్య" మని రసగంగాధరకారుఁడు చెప్పినలక్షణము వానికిఁ బట్టదు. కావున నవి గద్యకావ్యములు కానేరవు. మనవాఙ్మయములో నెన్నఁదగినగద్యకావ్యములు బాణభట్టకృతకాదంబరీహర్షచరిత్రములు. "సరస్వతీదత్తవరప్రసాద శ్చక్రే సుబంధు స్సుజనైకబంధుః। ప్రత్యక్షరశ్లేషమయప్రబంధవిన్యాసవైదగ్ధ్యనిధిర్నిబంధ" మని తన్నుఁదాను జెప్పుకొన్నసుబంధుకవి శ్లేషయమకానుప్రాసాదిశబ్దాలంకారములతోను బరిసంఖ్య, విరోధాభాస, ఉపమ, ఉత్ప్రేక్ష మొదలగు నర్థాలంకారములతోను గూడినగద్యమును రచించుటకు మొదటివాఁడు. ఇతఁ డట్టిగద్యతో వాసవదత్త యనునొకగద్యకావ్యమును రచించెను. ఈ శైలినే యవలంబించి మఱికొన్నివిశేషములను జేర్చి బాణుఁడు కాదంబరీహర్షచరిత్రములను రచించెను. "కవీనా మగళ ద్దర్పో నూనం వాసవదత్తయా" యని బాణుఁడు హర్షచరిత్రపీఠికలో సుబంధునివాసవదత్తనుఁ గొని

యూడెను. కాదంబరీహర్షచరిత్రలను జూచి యిటీవలివాఁ
డగుధనపాలుఁడు తిలకమంజరిని వాదీభసింహుఁడు గద్య
చింతామణిని నిట్టిశైలి ననుసరించియే వ్రాసిరి. ఈకాదంబరీ
హర్షచరిత్రలలో మొదటిది కథ, రెండవది యాఖ్యాయిక.
ఆచార్యదండి కావ్యాదర్శమందుఁ గథాఖ్యాయికలకు లక్షణ
మిట్లు చెప్పియున్నాఁడు. "అపాదః పదసంతానో గద్య
మఖ్యాయికా కథా। ఇతి తస్య ప్రభేదౌ ద్వౌ తయో రా
ఖ్యాయికా కిల। నాయకేనైవ వాచ్యాన్యా నాయకే నేత
రేణవా। స్వగుణావిష్క్రియాదోషో నాత్ర భూతార్థశం
సినః। అపిత్వనియమో దృష్ట స్తత్రా ప్యన్యై రుదీరణాత్।
అన్యో వక్తా స్వయంవేతి కీదృగ్వా భేదలక్షణం। వక్త్రం
చాపరవక్త్రంచ సోచ్ఛ్వాసత్వంచ భేదకం। చిహ్న మాఖ్యా
యికాయా శ్చే త్ప్రసంగేన కథాస్వపి। ఆర్యాదివత్ప్రయోగః
కిం నవక్త్రాపరవక్త్రయోః। భేదశ్చ దృష్టో లంభాది రుచ్ఛ్వా
సోవాస్తు కిం తతః। తత్కథాఖ్యాయికేత్యేకా జాతి స్సంజ్ఞా
ద్వయాంకితా। అత్రైవాంతర్భవిష్యంతి శేషా శ్చాఖ్యాన
జాతయః॥" ఛందోబద్ధముగానిపదసమూహమునకు గద్యయని
పేరు. అది యాఖ్యాయిక యనియుఁ గథయనియు రెండువిధ
ములు. ఆఖ్యాయికను గథానాయకుఁడే చెప్పును. కథ నాయ
కుని చేఁగాని యితరునిచేఁగాని వర్ణింపఁబడును. తనగుణ
ములఁ దాను వెల్లడిచేసికొనుట నాయకునికిఁ దప్పుకాదా
యందు లేమో? యాథార్థ్యమును జెప్పుటయందు దోషము
కాదు. పూర్వోక్త మగుప్రాచీనమతమును దూషించుచు
న్నాఁడు. ఆఖ్యాయికయందు నాయకుఁడే తనకథను జెప్పు

కొనవలయు ననునియమము లేదు. అన్యులుకూడఁ జెప్పుంట కానవచ్చుచున్నది. తనకథను దాను జెప్పిననేమి? అన్యులు చెప్పిననేమి? ఇది యేపాటిభేదలక్షణమన్నచో సత్యముకాదు. ఆఖ్యాయికలోఁ బ్రత్యుచ్ఛ్వాసప్రారంభమందు వక్త్రాపర వక్త్రశ్లోకము లుండుటచేతను గ్రంథవిభాగముల కుచ్ఛ్వాసము లని పేరుండుటచేతను గథకంటె నాఖ్యాయిక వేఱైనదని పలికెద వేమో? కథయందుఁగూడఁ బ్రస్తావక్రమమున నార్యావృత్తమువలె వక్త్రాపరవక్త్రము లుండును. "ఆర్యావక్త్రాపరవక్త్రాణాం ఛందసా యేన కేనచి" త్తని కథాలక్షణాధికారమందుఁ జెప్పఁబడియుండుటచేఁ గథాఖ్యాయికలకు భేదమే లేదు. ఆఖ్యాయికలోఁ గథాంశవిచ్ఛేదముల కుల్లాసములనియు నుచ్ఛ్వాసములనియుఁ, గథలో లంభమని సంజ్ఞయుండుట యేపాటిభేదకము. అది సంజ్ఞామాత్రము. అందువలనఁ గథయనియు నాఖ్యాయికయనియు సంజ్ఞామాత్రభేదమేగాని వాస్తవభేద మేమియు లేదు. జాతి యొక్కటియే చూర్ణకము, ఉత్కలికాప్రాయము, వృత్తగంధి, ఖండకథ, పరికథ, కథానిక మొదలగునవి కథాఖ్యాయికలలో నంతర్భవించుచున్నవి.

1. దీర్ఘసమాసరహితములు, కోమలవర్ణసంయుక్తములు నగుపదములతోఁ గూడినది చూర్ణిక యనంబడును. ఉదా. అభ్యాసోహి కర్మణాం కౌశల మావహతి। నహి సకృన్నిపాతమాత్రే ణోదబిందురపి గ్రావణి నిమ్నతా మాదధాతి.

2. ఉత్కలికాప్రాయము. ఉత్కలిక యనఁగా నుత్కంఠ. ఎద్ది వినువారికి బహుళముగా నుత్కంఠను గలిగించునో యది యుత్కలికాప్రాయ మనంబడు. ఉత్ - ఉల్లసంతీం కలికాం రుహీరుహీ కా త్ప్రీతి ప్రాప్నోతీ త్యుత్కలికాప్రాయమ్.

3. వృత్తగంధి. దీనిలోఁ గొంతభాగము వృత్తచ్ఛాయ ననుకరించియుండును గావున వృత్తగంధియని పేరు కలిగినది. ఉ. పాతాళతాలుతలవాసిషు దానవేషు - ఇందులో వసంతతిలకావృత్తభాగము కానవచ్చుచున్నది.

4, 5. ఖండకథాపరికథలయం దమాత్యుఁడుగాని ద్విజసామాన్యుఁడుగాని నాయకుఁడుగా నుండును. రెండును గరుణరసప్రధానములు. విప్రలంభము వర్ణింపఁబడును. వీనిలో ఖండకథ నమాప్తి నొందదు. అది ప్రధానకథ ననుసరించియుండును. కథాఖ్యాయికలకు సంమేళనము పరికథ యనంబడును.

6. కరుణభయానకరసములతోఁ గూడినదియయి యంతమం దద్భుతరసము గలది.

హర్షచరిత్రములో బాణకవి గ్రంథనాయకుఁ డగు హర్షవర్ధనునిచరిత్రము నేగాక స్వీయచరిత్రమునుగూడ వ్రాసికొనియున్నాఁడు. ఇట్లు ప్రాచీనకవు లెవ్వరును దమవృత్తాంతమును దెలుపలేదు. హర్షునిచరిత్రమందుఁగూడ సత్యమైన చారిత్రాంశములను దా నెఱిఁగినంతమట్టుకు వ్రాసియున్నాఁడు. మనవాఙ్మయములో వాస్తవచరిత్రను బోధించుగ్రం

థములు తక్కువగా నున్నవి. అవి యెవ్వియనిన (1) కల్హణ కృతరాజతరంగిణి. ఇందులోఁ గాశ్మీరదేశము నేలినమహారాజులవృత్తాంతము పూర్ణముగా వర్ణింపఁబడినది. (2) బిల్హణుఁడు రచించిన విక్రమాంకదేవచరిత్రము. ఇందులోఁ జాళుక్యవంశపురాజులచరిత్రము సమగ్రముగాఁ బ్రతిపాదింపఁబడినది. (3) వాక్పతిమిశ్రకృతగౌడవధ యను ప్రాకృత కావ్యము. యశోవర్మకు గౌడరాజునకు జరిగినయుద్ధ వృత్తాంత మిందు విపులముగాఁ దెలుపఁబడినది.

ఈహర్షచరిత్రప్రథమోచ్ఛ్వాసమందు బాణుఁడు తనజన్మోత్కర్షను సూచించునొకయైతిహ్యమును గల్పించి వ్రాసెను. ద్వితీయతృతీయోచ్ఛ్వాసములయందుఁ దనవృత్తాంతమును దక్కినయుచ్ఛ్వాసములలోఁ దనప్రభువైనహర్షవర్ధనుని జన్మాదికథను బూర్ణముగాఁ దెలిపి తరువాతఁ బుట్టినచరిత్రకారులకుఁ గడుసహాయము గావించెను. ఈకవి తనవంశమున కుత్కర్షము నాపాదించుటకు సరస్వతీసంబంధనివేదక మగు నొకకథను గ్రంథాదియందుఁ బెట్టెను. అది యెట్లనఁగా;—

ఒకకాలమందు బ్రహ్మ స్వలోక మగుసత్యలోకములో దేవర్షులు,బ్రహ్మర్షులు, దేవతలు, సిద్ధసాధ్యాదిగణంబులు తన్నుఁ బరివేష్టించి యుపాసింపఁగా సరస్వతీసమేతుండై పేరోలగంబున నుండె. అపు డాసభలో నున్నవా రనేకవిధములఁ బరమేష్ఠిని సన్నుతించిరి. వారిలో నతికోపనుఁ డగుదుర్వాసుఁడు సామములఁ బాడుచు స్వరస్ఖాలిత్యము నొనర్చెను. అది విని సరస్వతి నవ్వెను. అందుపైని దుర్వాసుఁ డత్యంత

కుపితుఁడై సరస్వతిని మర్త్యలోకమునకుఁ బొమ్మని శపించెను. అంతఁ బ్రతిశాప మిచ్చుట కుద్యతురాలై యున్న సరస్వతిని వారించి పద్మజుఁడు పుత్రిముఖావలోకన మగు వఱకు నామె భూలోకమం దుండవలయుననియుఁ దరువాత మరలఁ దనలోకమునకు రావలయుననియు నాదుర్వాసుని శాపమును మార్చెను. సరస్వతియు మునిశాపమును మన్నించి సావిత్రితోఁ గూడి భూలోకమందుఁ బ్రవేశించి శోణనదీతీరమం దున్నయరణ్యములో నొకపర్ణకుటీరమును గల్పించుకొని సుఖముగా జీవించుచుండెను. ఇట్లు కొన్నిదినములు గడచిన పిదప నొకనాఁటిప్రాతఃకాలంబున హయహేషాధ్వని వినంబడియె. ఇట్టి వివిక్తారణ్యమందు హేషాధ్వని వినవచ్చుటకుఁ గారణం బేమియని విచికిత్సాపన్నురాలై కమలజురాణి విపినమధ్యంబునఁ గొంతద వ్వరిగి నల్గడల నీక్షింప నాశ్వీకబృందానుయాతుండు, నున్నతహయారూఢుండు, రూపజితమారుండు నగు నొకఋషికుమారకుని వానివెనుకఁ జనుదెంచుచున్నయొకవృద్ధునిఁ జూచెను. వా రుభయులు సరస్వతీసావిత్రులను జూడవచ్చిరి. అంత సావిత్రి వారిరువురికి వనవాసోచిత మగునాతిథ్యమును సలిపి సేమంబరసి కొంతవడి యూరకుండి యావృద్ధు నుద్దేశించి " ఆర్యా ! ఇక్కుమారుం డెవ్వఁడు? ఇతనితలిదండ్రు లెవ్వరు ? ఎచటినుండి యెచటికిఁ బోవుచున్నా " రని యడుగఁగా నాస్థవిరుం "డితఁడు చ్యవనఋషికి మహారాజశర్యాతిపుత్రిక యగు సుకన్యయందు జన్మించినవాఁడు. ఇతనిపేరు దధీచి. ఈచిన్నవాఁడు పుట్టిన

నాఁటనుండి మాతామహునియింటనే యుండెను. సకలవిద్యాపారంగతుఁడై యుపాత్తసమావర్తనుఁడైనయితనిని జూడవలెనని తండ్రి కోరఁగాఁ బితృగృహంబునకుఁ బోవుచున్నవాఁడను. నే నతనికి నానుమాత్రీకుఁడను. నాపేరు వికుక్షి. చ్యవనాశ్రమ మిచటికి కాసన్నమే * యని వక్కాణించెను. కొంతసే పుండి దధీచి వికుక్షులు సరస్వతీసావిత్రుల యనుజ్ఞ వడసి యథాభిలషితదేశంబునకు జనిరి. అంత సరస్వతి దధీచి రూపవిలావణ్యాకృష్టచిత్త యయ్యె. అతఁడును సరస్వతీసక్తమానసుం డయ్యె. ఇట్లు వా రిరువురు పరస్పరానురక్తచిత్తులై యొకసంవత్సర మొకచోట సుఖముగాఁ గడిపిరి. అంత సరస్వతి గర్భవతియై యొకపుత్త్రుని గాంచెను. వానిపేరు సారస్వతుఁడు. ఆపుత్త్రుని సరస్వతి చతుర్దశవిద్యావిశారదునిం జేసి దధీచిని వీడ్కొని సావిత్రితో బ్రహ్మలోకంబున కరిగె. దధీచియు సరస్వతీవియోగసంతాపవిహ్వలమానసుండై తన కుమారుఁ డగుసారస్వతునిఁ దనతమ్మునిభార్య యగునక్షమాల యనుదాని కొప్పగించి విరక్తుఁడై తపశ్చర్యారతిచే నరణ్యంబునకుఁ బోయెను. అక్షమాలకూడ నక్కాలమందే యొకపుత్త్రుని గనియె. వానిపేరు వత్సుఁడు. వారిద్దఱి నక్షమాలయే తుల్యప్రీతిచే స్తన్యమిచ్చి పెంచెను. కొంతవయస్సు వచ్చినతరువాత సారస్వతుఁడు తనపితృవ్యపుత్త్రుఁ డగువత్సునికిఁ దనమహిమచే సకలవిద్యలను సంక్రమింపఁజేసి జటావల్కలధారియై తపస్సాచరించుటకుఁ దండ్రియొద్దకుఁ బోయెను.

ఆవత్సునివలన నొకవిశుద్ధబ్రాహ్మణవంశ ముత్పన్నమయ్యె. కాలక్రమమున నావంశమందుఁ గుబేరుఁ డనునొక

బ్రాహ్మణోత్తముఁడు జనించెను. వాని కచ్యుతుఁడు, ఈశానుఁడు, హరుఁడు, పశుపతి యను నలుగురుపుత్రు లుద్భవించిరి. వారిలోఁ బశుపతి కర్థపతి యనువాఁడు పుట్టెను. అయ్యర్థపతికి భృగువు, హంసుఁడు. శుచి, కవి, మహీదత్తుఁడు, ధర్ముఁడు, జాతవేదుఁడు, చిత్రభానుఁడు, త్ర్యక్షుఁడు, అహిదత్తుఁడు, విశ్వరూపుఁడు నని పదునొకండుతనయు లుత్పన్నులైరి. వారిలోఁ జిత్రభానుఁ డనువానికి రాజదేవి యనుబ్రాహ్మణియందు బాణుఁ డుదయించెను. ఇతని శైశవమందే తల్లి మృతినొందెను. కొంతకాలము తండ్రియే యితనిని సంరక్షించి వార్ధకమురాకుండ నతఁడును బంచత్వమునొందెను. బాల్యమందు వేదశాస్త్రములను జదివి మహాపండితుఁడై యున్నను యౌవనదశలో స్వైరవిహారియై దేశాటనము చేసి బంధుగృహములను వీక్షించి విద్వత్సమాజములఁ బరిశీలించి మరల స్వనివాసస్థాన మగుప్రీతికూట మనుగ్రామము నకుఁ జేరెను.

ఈసమయమందు హర్షునిసోదరుఁ డగుకృష్ణభూపతి మహారాజసందర్శనమునకు రమ్మని వార్తఁబంపగాఁ వెళ్ళి చక్రవర్తిని జూచి మరల నిజనివాసంబున కేతెంచెను. ఈ బాణుని కనేకులు మిత్రు లుండిరి. వారిలోఁ గొందఱు విద్వాంసులు, కవులు, పౌరాణికులు, గణకులు, మఱికొందఱు గాయకులు, ఇంద్రజాలికులు, చిత్రకారులు. వీ రొక జాతివారు కారు. వీరిలోఁ గొందఱు స్త్రీలు. కొందరు పురుషులు. బాణుఁడు వీరితో నెల్లపుడు కలిసియుండెడివాఁడు. ఒకనాఁ డీతనిమిత్రులలో నొకఁడగు సుదృష్టియనువాఁడు

వాయుపురాణమును జదువుచుండఁగాఁ దక్కినవారందఱు కుతూహలముతో వినుచుండిరి. అప్పుడు సూచి బాణుఁ డనువంది

"తదపి మునిగీత మతిపృథు త
దపి జగద్వ్యాపి పావనం చరితం
హర్షచరితా దభిన్నం ప్రతి
భాతిహి మే పురాణ మిదమ్"

అని యొకశ్లోకమును జదివెను. అది విని బాణునిమిత్రుఁలందఱు హర్షునిచరిత్రమును దమకుఁ జెప్పుమని యతనిని ప్రార్థించిరి. అపుడు బాణుఁడు వారిప్రార్థనను మన్నించి యాచరిత్రము నిట్లు చెప్పందొడంగె.

"మిత్రులారా! వినుఁడు. స్థానేశ్వరమను (Thaneswar) నొకదేశవిశేషము కలదు. దానిలో శ్రీకంఠ మను దేశ మొక భాగమై యుండెను. దానిని బుష్పభూతి యను నొకరాజు పాలించెను. అతఁడు బాల్యము నుండి పరమమాహేశ్వరుఁడు. అతనిమంత్రులు, సచివులు, భృత్యులే కాక యతనిచేఁ బరిపాలింపఁబడు దేశమం దున్న ప్రజ లందఱు పరమశైవులై యుండిరి. ఆకాలమందు భైరవాచార్యుఁ డనునొకద్రవిడదేశపుసన్యాసి సకలశైవతంత్రవిశారదుఁడు శివభక్తుఁ డుండెను. అతనిప్రసిద్ధి లోకమం దెల్లెడల వ్యాపించెను. పుష్పభూతియు శివభక్తుఁడుగావున నా భైరవాచార్యుని జూచుట కమితకుతూహలము గలవాఁడై యుండెను. ఇట్లు కొంత కాలము గడచినతరువాత నొకనాఁ డాతనిశిష్యుఁడు వచ్చి భైరవాచార్యునిరాక నెఱింగించెను.

రాజు భైరవాచార్యుని జూడఁబోయెను. మఱియొకదినమందు భైరవాచార్యుఁడు రాజుసన్నిధి కేతెంచి కొంతసేపు సంభాషించి "మహారాజా! తొల్లి నేను మహాకాళహృదయ మనుమహామంత్రమును కృష్ణవస్త్రమాల్యానువేపనధరుండనై శ్మశానమందుఁ గల్పోక్తవిధిగాఁ గోటిజపముచే నుపాసించియున్నాను. వేతాళసాధనముచేఁగాని మంత్రసిద్ధి లభింపదు. అసహాయులు వేతాళమును సాధింపఁజాలరు ఈపనికి మీరు సమర్థులు. మీ రఖిలకార్యభారమును వహింపఁగా నాశిష్యులు మఱిముగ్గురు నాకు సహాయు లగుదురు. ఆగామి కృష్ణపక్షచతుర్దశినాఁటి రాత్రికి మీ రాయుధద్వితీయులై శ్మశానమునకుఁ దప్పక రావలయు నని ప్రార్థించెను. పుష్పభూతియు నందు కియ్యకొనెను. అతఁడు యథాప్రతిజ్ఞాతముగా నాఁటిరాత్రి నిస్త్రింశపాణియై యచటికిఁ బోయి తక్కినముగ్గురిని గలిసికొనెను. భైరవాచార్యుఁడు ప్రేతభూమియందు శవముపైఁ గూర్చుండి కర్మనాచరించుచుండఁగా నలుగురు నాలుగుదిక్కులయం దప్రమత్తులై కాపాడుచుండిరి. అనేకము లైనభూతప్రేతపిశాచాదులు కర్మవిఘ్నము నాచరించుటకుఁ వచ్చి విఫలప్రయత్నములై తొలఁగిపోయెను. అంతలో రాత్రి యామమాత్రావశిష్టమై యుండఁగా రాజు నిలువఁబడినదిక్కున భూరంధ్రమునుండి ఘోరరూపుఁడైనయొకనాగుఁడు బయలువెడలి రాజుమ్రోల నిలిచి "ఓరీ దురాత్ముఁడా! ఈక్షేత్రాధిపతి నైననాకుఁ బూజ సల్పక యిట్టిపని చేయించుచుంటివా! శ్రీకంఠు డనునన్నెఱుఁగవా? నావలననేకదా యీదేశమునకు శ్రీకంఠమని

పేరు కలిగినది. న న్నింతయలక్ష్యము చేసితివా " యని రాజు నెదిరించెను. అంత నారాజు వానితో బాహుయుద్ధముచేసి వానిని నేలఁబడగొట్టెను. ఇంతలోఁ గమలగంధ మాఘ్రాణింపఁబడెను. నూపురధ్వని వినఁబడెను. మహాతేజస్సుతో నొకస్త్రీ కానవచ్చెను. ఆమెను జూచి రాజు విస్మయము నొంది "అమ్మా! నీవెవ్వతెవు. ఈయర్ధరాత్రిమం దిచటి కేలవచ్చితి " వనియడుగఁగా " నేను విష్ణువక్షస్స్థలారూఢ నగుమహాలక్ష్మిని. నీపరాక్రమముచే మిగుల సంతసిల్లితిని. "వర మడుగు" మనిపలికెను. రాజు స్వార్థనిరపేక్షుఁడై మాంధిరవాచార్యులకుఁ గర్మసిద్ధి నొసంగుమని ప్రార్థించెను. మహాలక్ష్మి దానికి సమ్మతించి " రాజా! నీవు చంద్రసూర్య వంశములతో సమానమైనగొప్ప రాజవంశమున కుత్పాదకుఁడ వగుదువని వరమిచ్చి యంతర్హితురాలయ్యెను. శ్రీకంఠుఁడును వినీతుఁడై రాజునొద్ద సెలవుపుచ్చుకొని తాను వచ్చినభూ వివరమును జొచ్చిపోయెను.

ఇది హర్షచరిత్ర మూఁడుచ్ఛ్వాసములలోనికథ. ఇందులోఁ గొంత వాస్తవచరిత్రము కొంత పౌరాణికకథ (myth) కలిసియున్నది. బాణునిస్వీయచరిత్ర మంతయు నిజముగా నమ్మఁదగియున్నది.

పైనఁ జెప్పఁబడినపుష్పభూతి యీహర్షునివంశము నకు మూలపురుషుఁడు. వానినుండి గొప్పరాజవంశ ముత్పన్నమైనది. తగిన గ్రంథాధారములుగాని శాసనములుగాని లేకపోవుటచే నాకాలపురాజులనామధేయములుగాని చరిత్రములుగాని మనకుఁ దెలియవు. రాధాకుముదముఖర్జి యను

పండితుఁడు వ్రాసిన హర్షచరిత్ర (Rulers of India series) లో నిచ్చిన (mothern plate inscription) మధువనశాసనములో

హర్షుని తండ్రి-తాత-ముత్తాత వానితండ్రి పేర్లు కాన వచ్చుచున్నవి. ఇదిగాక గంజాంజిల్లా సోమపేట తామ్రశాసనములోను ఖాన్ ఖేర శాసనములోనుకూడ నీవంశవృక్షము కానవచ్చుచున్నది.

హర్షునివంశవృక్షము.

మహారాజనరవర్ధన
(వజ్రిణీదేవి)
|
మహారాజరాజ్యవర్ధన I
(అప్సరోదేవి)
|
మహారాజ ఆదిత్యవర్ధన
(మహాసేన గుప్తాదేవి)
|
మహారాజాధిరాజ ప్రభాకరవర్ధన
(యశోమతీదేవి)

మహారాజాధిరాజ రాజ్యవర్ధన | మహారాజాధిరాజ హర్ష | రాజ్య

## జన్మము.

ఆవంశమునందుఁ బ్రతాపశీలాపరనాముఁడైన ప్రభాకర వర్ధనుఁ డనుమహారాజు పుట్టెను. అతఁడు హూణహరిణకేసరి, సింధురాజజ్వరము, ఘూర్జరప్రజాగరము, గాంధారాధిపగంధద్విపకూటపాకలము, లాటపాటవపాటచ్చరుఁడు, మాలవలక్ష్మీలతాపరశు వనుబిరుదములను సంపాదించెను.

ప్రభాకరవర్ధనుఁడు పుత్త్రలాభముకొఱకుఁ జిరకాలము సూర్యు నుపాసింపఁగా నొకనాఁటిరాత్రి రాజు మేడపై శయనించియుండ నొకస్త్రీతోఁగూడిన యిరువురుపురుషు లాకాశమునుండి డిగివచ్చి రాజుశయనసమీపశయనస్థురా లగు యశోవతీదేవియొక్క గర్భమును జేరి యందులోఁ బ్రవేశించినట్లు కలఁగనెను. తరువాతఁ గొంతకాలమునకు రాజ్యవర్ధనుఁడు హర్షవర్ధనుఁడు ననుపేళ్లు గలయిద్దరుపుత్త్రులు రాజ్యశ్రీ యనునొకపుత్త్రిక పుట్టెను. వీరిలోఁ రాజ్యవర్ధనుఁడు జ్యేష్ఠుఁడు. హర్షవర్ధనుఁడు కనిష్ఠుఁడు. ఇతఁడు క్రీస్తుశకము 590 సం॥ జ్యేష్ఠమాసములోఁ జనించెను. హర్షుఁడు భూమిపై డుగులఁ బెట్టుచున్నసమయమున రాజ్యవర్ధనుఁ డాఱేండ్లవయస్సు గలవాఁడై యుండెను. ఈరాజసుతులు పెరుగుచుండఁగా యశోవతిదేవిసోదరుఁడు భండి యను తనకుమారుని వీరుభయులకు సేవకునిగా నొప్పగించెను. మఱికొంతకాలము గడచినతరువాత మాలవదేశాధీశ్వరుఁడు మాధవగుప్తకుమారగుప్త లనుతనకుమారులను రాజపుత్త్రుల కనుచరులనుగా నొనర్చెను. ప్రభాకరవర్ధనుఁ డుపార్యాధయావను లయిన

తనపుత్రులను జూచి " భవామి దృష్ట్వాచ పున ర్యువేవ " (శ్రీరామా బాల) అన్నట్లానందాబ్ధిమగ్నుఁడయ్యెను.

మఱికొంతకాలమునకుఁ బ్రభాకరవర్ధనుఁడు జ్యేష్ఠ పుత్త్రుఁడగు రాజ్యవర్ధనుని జతురంగసైన్యసమేతునిగాఁ జేసి హూణులను జయించుటకుఁ బంపెను. అట్లు దండయాత్రకుఁ బోవుచున్న రాజ్యవర్ధనునివెంబడి హర్షుఁడును గొంతదూర మఱిగి కైలాసపర్యంతారణ్యమందు మృగయావిహారియై కొన్నివాసరంబులఁ బుచ్చె హర్షుఁ డచ్చట నిజానుచరులతో మృగయావినోద మనుభవించుచున్న దినములలో నొకనాఁటి రాత్రి వేకువజామున నొకవృద్ధసింహము ఘోరదావాగ్ని జ్వాలాపరీతమై దగ్ధమైనట్లు సింహియుఁగూడ భర్తృవియోగ శోకమును సహింపఁజాలక పిల్లలను విడిచిపెట్టి యామహా గ్నిలో నురికినట్లు స్వప్నమందుఁ గాంచెను. అంతఁ బ్రబుద్ధుఁడై హర్షుఁడు వృద్ధులైనతలిదండ్రులకనర్థమును శంకిం చుచుండెను. దుర్నిమిత్తములు పెక్కులు పొడసూపెను. ఇట్లతఁడు చింతాందోళితచిత్తుఁడైయుండ స్వనగరమునుండి కురంగకుఁ డనుభృత్యుఁ డొకఁడు కడువేగముగాఁ జనుదెంచి " కుమారా! మహారా జతిదుస్సహమైనదాహజ్వరముచేఁ బీడింపఁబడుచున్నఁ డనుదుర్వార్తను దెలిపెను. అది విని హర్షుఁడు నితాంతచింతావ్యాకులితస్వాంతుఁడై పరివారమును వెనుకనుండి నెమ్మదిగా రమ్మని యాజ్ఞాపించి తా నొకఁడు వాయువేగమున హయారూఢుఁడై యాహారములేకుండ మూఁడుదినములలో స్వపురంబుఁ జేరెను. అంతఃపురమునకుఁ బోయి మరణవేద నతో నున్నజనకుని గాంచెను. తల్లి యశోవతియు భావిభర్తృ

వియోగదుఃఖమును సహింపఁజాలక సరస్వతీనదీతీరమం దగ్ని లోఁబడి ప్రాణములఁ బరిత్యజించెను. మంత్రిసామంతాదిసములకు రాజు కుమారునికిఁ జేయవలసినహితోపదేశముఁ జేసి స్వర్గాతిథియయ్యెను.

హర్షుఁడు పితృమరణమునకు శోకించుచుండఁగా రాజ్యవర్ధనుఁడు యుద్ధమందు హూణులను జయించి రాజధానికేతెంచెను. అతఁడు దుర్భరపితృవ్యాపత్తిదుఃఖముచే రాజ్యపరిపాలన మొల్లననియు విరక్తుఁడనై కాషాయమును ధరించి తపశ్చర్యారతుఁడనై యరణ్యమందు నివసించెదనని నిశ్చయించెను. అత్తఱి హర్షుఁడు జ్యేష్ఠసోదరుని బ్రతిమాలి దుఃఖోపశామక మగుమాటలు చెప్పి యెట్టకేలకు వానిని రాజ్యపరిగ్రహమునకు సమ్మతింపఁజేసెను.

ఇట్టిసమయమందు హర్షునిసోదరి యగురాజ్యశ్రీయొక్క భర్త యయినగ్రహవర్మను మాళవదేశపురాజు శిలాదిత్యుఁడు చంపివేసినాఁడనియు రాజ్యశ్రీ కాన్యకుబ్జమందుఁ జారకములో నుంచఁబడెననియు రాజ్యశ్రీభృత్యులలో ముఖ్యతముఁడైన సంవాదకుఁ డనువాఁడు వచ్చి రాజసోదరులతోఁ జెప్పెను. అపుడు రాజ్యవర్ధనుఁ డతికుపితుఁడై భండిని వెంటఁ బెట్టుకొని తా నొక్కఁడే మాళవరాజు నెదిరింపఁబోవుదునని పలికి హర్షుని రాజధానిలోనుండి పొమ్మని నిర్బంధించి భండితోఁ దా నొక్కఁడే పోయెను. అంతలో నాకస్మికముగా రాజ్యవర్ధనుని కత్యంతప్రియుఁ డైనకుంతలుఁడనువాఁ డతిదైన్యముతో వచ్చి "మీయన్న మహాపరాక్రమముతో మాళవ

రాజు సైన్యము నోడించినను దుదకు శశాంకుఁ డనుగౌడ రాజుచే రహస్యముగాఁ జంపఁబడెనని హర్షునితోఁ జెప్పెను. రాజ్యవర్ధనునియనంతరము కనోజరాజ్య మరాజకముగా నుండుటచే బానియనువాఁడు హర్షుని సింహాసన మెక్కుమని బోధించెను. కాని యతఁ డట్లుచేయుటకు సంకోచించుచుండఁగా బోధిసత్త్వావలోకితేశ్వరుఁడనువాఁ డతనిసంకోచమును బోఁగొట్టి మహారాజశబ్దము లేకుండ సింహాసనమెక్కక రాజపుత్రుఁడని వ్యవహారముచే రాజ్యపాలనముఁ జేయుమని యుపదేశించెను. అందుపై నతఁడు శిలాదిత్యహర్షవర్ధన నామమును వహించి కనోజికి రాజయ్యెను. బాణుఁడు చెప్పినవృత్తాంతము చీనదేశపుయాత్రికుఁడు చెప్పినవృత్తాంతముతో సంవదించుచున్నది. రాజ్యశ్రీప్రేరణచే హర్షుఁడు రాజ్యపాలన మంగీకరించెనని బాణుఁడు చెప్పియున్నాఁడు. హర్షుఁడు బాల్యమందే బౌద్ధమత మవలంబించి భిక్షువునగుదునని ప్రతిజ్ఞ జేసియుండుటచే రాజ్యము నపేక్షింపలేదని కొందఱు పాశ్చాత్యపండితులు వ్రాసియున్నారు. దిగ్విజయముఁ జేసినతరువాత బౌద్ధమతమును స్వీకరించెనని బాణుఁడు వ్రాసియున్నాఁడు. వైధవ్యదుఃఖిత యగుతనచెల్లెలితోఁ గలిసి రాజ్యముఁజేయుట కట్లుపేక్షాబుద్ధిగలవాఁ డయ్యెనని మఱికొందఱి యభిప్రాయము.

ఇపుడు హర్షుఁడు రెండుపనులు చేయవలసివచ్చెను. కారాగారనిబద్ధ యయినతనసోదరిని విడిపించి తెచ్చుట యొకపని. అన్నను జంపినవారిపైఁ బగఁదీర్చుకొనుట రెండవపని.

తొల్లి పరశురాముఁడు పితృవధామర్షముచేఁ గాత్రవీర్యుని కుటుంబమునేగాక లోకములో నుండుసకలక్షత్రియజాతిని నిర్మూలముచేసినట్లు హర్షుఁడు తనసోదరుని జంపినగౌడరాజునేగాక భరతఖండములో నుండురాజుల నందఱిని వధించి తనరాష్ట్రమును విస్తరింపఁజేయుట కొకశుభదినమందు దిగ్విజయార్థము బయలుదేరెను. హర్షునికిఁ బితృసఖుఁడైన సింహనాదుఁడను సేనాధిపతి యితని నీపనికిఁ బ్రోత్సాహపఱిచెను. హర్షుఁడు జగత్తు నిర్గౌడ మొనర్చెదనని ప్రతినఁబూనెను. యుద్ధసన్నాహ మొనర్పుమని యవంతియను యుద్ధసచివుని కాజ్ఞాపించెను. హర్షుఁడు చతురంగసైన్యసమేతుఁడై బయలుదేరి మొదట సరస్వతీనదీతీరమందు విడిసెను. అచ్చటనుండి కథకునిఁ జూడవచ్చెను. అస్థలమందుఁ గామరూపదేశా (Assam) ధీశ్వరుఁ డగుభాస్కరవర్మ యమూల్యము లగువస్తువులను గానుకగా హంసవేగుఁ డనుతనభృత్యునిద్వారమున హర్షునికిఁ బంపి యుద్ధమందు సహాయము చేసెదనని వాగ్దాన మొనర్చెను. హర్షుఁ డాయుపాయనములను బ్రీతితోఁ బరిగ్రహించి హంసవేగుని బంపివేసి యెడతెగనిప్రయాణములతోఁ బోవుచుండఁగా రాజ్యవర్ధనునిచే జయింపఁబడిన మాళవాధీశునిసైన్యమును వెంటఁబెట్టుకొని కొందఱు సామంతరాజులతో భండి మార్గమందుఁ గానవచ్చెను. రాజ్యవర్ధనునివధప్రకారము నంతయు సవిస్తరముగాఁ జెప్పెను. రాజ్యశ్రీవృత్తాంత మేమయ్యెనని హర్షుఁ డడుగఁగా రాజ్యవర్ధనవధానంతరము కనోజిరాజ్యమును గుప్తయనువాఁడు స్వాధీనపర్చుకొనఁగా రాజ్యశ్రీ కారాగృహము

రాజు సైన్యము నోడించినను దుదకు శశాంకుఁ డనుగౌడ
రాజుచే రహస్యముగాఁ జంపఁబడెనని హర్షునితోఁ జెప్పెను.
రాజ్యవర్ధనునియనంతరము కనోజరాజ్య మరాజకముగా నుం
డుటచే బానియనువాఁడు హర్షుని సింహాసనమెక్కుమని బో
ధించెను. కాని యతఁ డట్లుచేయుటకు సంకోచించుచుండఁగా
బోధిసత్త్వావలోకితేశ్వరుఁడనువాఁ డతనిసంకోచమును బోఁ
గొట్టి మహారాజశబ్దము లేకుండ సింహాసనమెక్కక రాజ
పుత్రుఁడని వ్యవహారముచే రాజ్యపాలనముఁ జేయుమని
యుపదేశించెను. అందుపై నతఁడు శిలాదిత్యహర్షవర్ధన
నామమును వహించి కనోజికి రాజయ్యెను. బాణుఁడు
చెప్పినవృత్తాంతము చీనదేశపుయాత్రికుఁడు చెప్పినవృత్తాంత
ముతో సంవదించుచున్నది. రాజ్యశ్రీప్రేరణచే హర్షుఁడు
రాజ్యపాలన మంగీకరించెనని బాణుఁడు చెప్పియున్నాఁడు.
హర్షుఁడు బాల్యమందే బౌద్ధమత మవలంబించి భిక్షువునగుదు
నని ప్రతిజ్ఞ జేసియుండుటచే రాజ్యము నపేక్షింపలేదని కొం
దఱు పాశ్చాత్యపండితులు వ్రాసియున్నారు. దిగ్విజయముఁ
జేసినతరువాత బౌద్ధమతమును స్వీకరించెనని బాణుఁడు
వ్రాసియున్నాఁడు. వైధవ్యదుఃఖిత యగుతనచెల్లెలితోఁ
గలిసి రాజ్యముఁజేయుట కట్లుపేక్షాబుద్ధిగలవాఁ డయ్యెనని
మఱికొందఱి యభిప్రాయము.

ఇపుడు హర్షుఁడు రెండుపనులు చేయవలసివచ్చెను.
కారాగారనిబద్ధ యయినతనసోదరిని విడిపించి తెచ్చుట యొక
పని. అన్నను జంపినవారిపైఁ బగఁదీర్చుకొనుట రెండవపని.

తొల్లి పరశురాముఁడు పితృవధామర్షముచేఁ గా క్షత్రియ కుటుంబము నేగాక లోకములో నుండుసకలక్షత్రియజాతిని నిర్మూలముచేసినట్లు హర్షుఁడు తనసోదరుని జంపిన గౌడరాజు నేగాక భరతఖండములో నుండురాజుల సంతతిని వధించి తనరాష్ట్రమును విస్తరింపఁజేయుట కొకశుభదినమందు దిగ్విజయార్థము బయలుదేరెను. హర్షునికిఁ బితృసఖుఁడైన సింహనాదుఁడను సేనాధిపతి యితని నిపనికి హెచ్చుగాఁ బురికొల్పెను. హర్షుఁడు జగత్తు నిర్గౌడ మొనర్చెదనని ప్రతినఁబూనెను. యుద్ధసన్నాహ మొనర్చుమని యవంతియను యుద్ధసచివుని కాజ్ఞాపించెను. హర్షుఁడు చతురంగసైన్యసమేతుఁడై బయలుదేరి మొదట సరస్వతీనదీతీరమందు విడిసెను. అచ్చటనుండి కథకుని జూడవచ్చెను. అస్థలమందుఁ గామరూపదేశా (Assam) ధీశ్వరుఁ డగుభాస్కరవర్మ యమూల్యము లగువస్తువులను గానుకగా హంసవేగుఁ డనుతనభృత్యునిద్వారమున హర్షునికిఁ బంపి యుద్ధమందు సహాయము చేసెదనని వాగ్దాన మొనర్చెను. హర్షుఁ డాయుపాయనములను బ్రీతితోఁ బరిగ్రహించి హంసవేగుని బంపివేసి యెడతెగనిప్రయాణములతోఁ బోవుచుండఁగా రాజ్యవర్ధనునిచే జయింపఁబడిన మాళవాధీశునిసైన్యమును వెంటఁబెట్టుకొని కొందఱు సామంతరాజులతో భండి మార్గమందుఁ గానవచ్చెను. రాజ్యవర్ధనునివధప్రకారము నంతయు నవిస్తరముగాఁ జెప్పెను. రాజ్యశ్రీవృత్తాంత మేమయ్యెనని హర్షుఁ డడుగఁగా రాజ్యవర్ధనవధానంతరము కనోజిరాజ్యమును గుప్త యనువాఁడు స్వాధీనపర్చుకొనఁగా రాజ్యశ్రీ కారాగృహము

నుండి తప్పించుకొని పరివారముతో వింధ్యారణ్యమును బ్రవేశించెనని చెప్పెను. అపుడు హర్షుఁడు జవిష్ఠమగునశ్వము నధిష్ఠించి వింధ్యాటవికిఁ బోవ నచట ననలప్రవేశముచే దేహత్యాగమును జేసికొనుటకు సిద్ధముగానున్న చెల్లెలిని జావు నుండితప్పించి తనతోఁ దీసికొనిపోయెను. హర్షుఁడు తనసోదరుని భగినీభర్తను జంపినరాజులను ఘోరసంగ్రామమందుఁ దునుమాడి వైరపారమునొందెను. వారిరాజ్యములను స్వాధీనపర్చుకొనెను. అంతతో విరమించక పడమటదిక్కున నున్న వలభిరాజ్యమును జయించెను. వలభిరాజును హర్షుఁడు మొదట జయించినను బిదప వానిని సామంతరాజునుగాఁ జేసికొని వానిరాజ్యమును వానికి విడిచిపెట్టెను. ఆనందపురము, కచ్ఛము, సౌరాష్ట్రము మొదలగుదేశములను స్వాధీనపర్చుకొనెననియు యువన్‌చంగు వ్రాసియున్నాఁడు. హర్షుఁ డిట్లవ్యాహతపరాక్రముఁడై దేశములను జయించి స్వాధీనపర్చుకొనుచుండఁగా నాకాలమందు మహారాష్ట్రదేశము నేలుచున్న చాళుక్యవంశపురాజైన ద్వితీయపులకేశి యనువాఁడు హర్షునికి లొంగలేదు. ఈయుభయులకు జరిగినయుద్ధమందు హర్షుఁడు పరాభవము నొందెను. క్రీస్తుశకము 634 సం॥ మందుఁ బుట్టినయయిహోలు (Ahihole) శాసనమందు రవికీర్తియను కవి పులకేశికీర్తిప్రతాపములను మెండుగా వర్ణించెను. కొస్రునామకపారశీకపురాజితనితో సంధిచేసికొనెను. సంయుక్త పరగణాలు, బెహారు, బంగాళాదేశము, ఒరిస్సా, పంజాబులోఁ గొంతభాగము, రాజపుటానా, పశ్చిమహిందూస్థానము, మధ్యహిందూస్థానము మొదలగుదేశములు హర్షునియేలు

బడిలో నుండెను. దక్షిణహిందూస్థానపుశాసనములలో హర్షుఁడుత్తరాపథమునంతయు నేలెనని చెప్పఁబడియున్నది. హర్షునికీర్తి చీనాదేశమువఱకు వ్యాపించెను. హర్షునికిఁ జీనా చక్రవర్తి, యితనికి హర్షుఁడు దూతలను బంపుచుండెడివారని చీనాయాత్రికుఁడు చెప్పెను.

హర్షుని రాజ్యపరిపాలనము, మతము, విద్య.

కల్పాంతస్థాయి యగుయశస్సు నొందినయశోకసముద్రగుప్తులయసాధారణమేధాసంపద, నిరుపమానబాహుపరాక్రమము, రాజనీతినిపుణత, ప్రజాపాలనదాక్ష్యము, శత్రునిబర్హణశక్తి, మొదలగుగుణవిశేషములు హర్షునియందుఁగూడ మెండుగా నున్నవి. ఇతఁడును సముద్రగుప్తునివలె సేనావ్యూహపరివృతుఁడై నానాదిగ్దేశములయం దొనర్చినదండయాత్రలలో సంపూర్ణజయమునొందెను. ఇతఁడు మొదటఁ జక్రవర్తిత్వమును సంపాదించుకొని ప్రశాంతయుద్ధకథుఁడై దేశమం దెల్లెడల శాంతిని నెలకొల్పెను. ప్రజలను నీతిమార్గమందుఁ బ్రవర్తింపఁజేసి వారిసౌఖ్యమును వృద్ధినొందించెను. హర్షునియుద్ధదోహలత్వము తన కపకృతినొనర్చిన శత్రువులపైఁ బగఁదీర్చుకొనుటకేగాని నిష్ప్రయోజనము కాదు. ఆకాలమందు హిందూరాజ్యలక్ష్మి స్థైర్యముగానక నళినీపత్రగతసలిలబిందుసందోహమువలె నతిచంచలస్థితి నొందెను. చిన్నరాజ్యము లనేకములు పుట్టెను. అట్టిసమయమందు హర్షుఁ డపరిమితసైన్యానుయాతుఁడై తూర్పుదెసకుఁ జని

యాఱుసంవత్సరములకాల మవిశ్రాంతయుద్ధయాత్రలను జరిపి పాంచాలము, గౌడదేశము, కన్యాకుబ్జము, మిథిల, ఉత్కలము మొదలగుదేశములను వశపఱ్చుకొనెనని యువన్ చాంగు తెలిపెనుగాని హర్షుఁడు చేసినదండయాత్రలవివరము పూర్ణముగాఁ దెలిసికొనుటకుఁ దగినయాధారము లెవ్వియు లేవు. సింధుదేశమును నేపాళదేశమును వశపఱ్చుకొనెననియు నాసాకుదేశపురాజుతో సఖ్యముఁజేసికొనెననియు బాణకవియే చెప్పుచున్నాఁడు. పశ్చిమమాళవదేశమును దానితో సంబంధించిన చిన్నసంస్థానములగు కబి, సూరట్, ఆనందపురము మొదలగువానిని జయించెనని యాత్రికుఁడే చెప్పెను. హర్షునిదండయాత్రలన్నియు నిర్విఘ్నముగా జరిగినను వింధ్యపర్వతమందు రేవానదీతీరమందు దక్షిణదేశపురాజైన రెండవపులకేశివలనఁ బరాభవము వాటిల్లెను.

ఉత్తరదేశమందుఁ బూర్ణముగాఁ దనయధికారమును స్థాపించినతరువాత హర్షుఁడు శత్రువుల కజేయుఁడగునట్లు తనసైన్యమును బలపఱ్చుకొనెను. అఱువదివేల యేనుఁగుల నొకలక్షపదాతులను గూడఁబెట్టెనని చైనాయాత్రికుఁడు చెప్పెను. ఏనుఁగులన్నియు నతనిసామంతరాజు లతనికిఁ బ్రీతిపూర్వకముగా సమర్పించినవేయని హర్షచరిత్రలో బాణుఁడు వ్రాసియున్నాఁడు. అతనిపట్టపేనుఁగుపేరు దర్పశాతము. వనాయు, అరట్ట, కాంభోజ, సింధు, పారశీకప్రభృతిదేశములనుండి గుఱ్ఱములను దెప్పించెను. ఇట్టి చతురంగసైన్యోపేతుఁడై యెచ్చట నేకాలమందు నాయుధ మెత్త

కుండఁ బరిశాంతముగా ముప్పదివత్సరములు రాజ్యమేలెనని
యువన్‌చాంగు చెప్పెను. అశోకునివలె నితఁడును స్వరాష్ట్రి
మును శాంతముగాఁ బరిపాలించుచు జ్ఞానసంపాదనతత్పరుఁ
డయ్యెను.

తనరాజ్యములో నేమూల నేమి జరుగుచున్నదో
యెచ్చట వివాదములు పుట్టుచున్నవో దానినంతయుఁ గనుం
గొనుట పాలకునికి ముఖ్యమైనపని. ఈవిషయములో హర్షుని
మించినరాజు లెవ్వరును లేరు. ఏదోయొకమిషఁ గల్పించు
కొని తరుచుగా నితఁడు స్వరాష్ట్రిమందు సంచారముచేయు
చుండెడివాఁడు. ఇతనిరాజ్యమందు భుక్తియనియు, విషయ
మనియు గ్రామమనియు మూఁడువిభాగములు కలవు. గవ
ర్నరుకు గోప్త, భోజిక, భోగపతియనియు నైసురాయికి రాజ
స్థానీయుఁడనియు నుద్యోగస్థులు నియోక్తులనియు, మఱి
కొన్నియుద్యోగములలో నున్నవారు మహాసామంతులు
మహారాజులు, దౌస్సాధనికులు, విషయపతులు, నుపరికులు,
కుమారామాత్యులు నని వ్యవహరింపఁబడిరి. పట్టణముల కధి
ష్ఠానములని పేరు.

Record Keepers = పుస్తకపాలురు

Record Officer = అక్షపటలము

Documents = కరణములు

Registrar = కరణిక

Bard = ప్రతినర్తక

Superintendant of the inner appartments = అధ్యక్షమహామాత్రి

Commander of infantary = సేనాపతి, మహాసేనాపతి, బలాధికృత, మహాబలాధికృత, భటస్వపతి.

Head of Cavalry = బృహదశ్వవార

Minister of peace and war = మహాసంధివిగ్రహిక

Chief justice = మహాదండనాయక

Policeman = దండపాశిక

Woman watchers of the night = యామచేటికాః

మతము — విద్య.

హర్షునిరాజ్యపాలనకాలమందు భరతఖండమునకుఁ గలిగినవిద్యాతిశయమును గుఱించి ధనాభివృద్ధిని గుఱించి యువన్‌చాంగు తెలియఁజేసిన వృత్తాంత మత్యద్భుతముగానున్నది. ఈచైనాయాత్రికుఁ డుదరపోషణముకొఱకు దేశాటనముచేయుసన్యాసులవంటివాఁడు కాఁడు. ఆసియాఖండపుదేశములన్నింటిలో భరతఖండ మొక్కటియే మోక్షసాధనజ్ఞానసంపత్తిని గుత్తగొన్నదేశమగుటచే నట్టిజ్ఞానమును సంపాదించుటకొఱకే యీయాత్రికుఁ డీదేశమునకు వచ్చెను. కనిష్కునికాలము మొదలుకొని వంగదేశపురాజైన ధర్మపాలుని కాలమువఱకు సుమారు పదివందలసంవత్సరములకాల మవిచ్ఛిన్నముగాఁ జైనాదేశపువిద్యార్థు లిండియాలోనున్న ప్రసిద్ధవిద్యాలయములకు వచ్చి సకలవిద్యలను నేర్చి పండితులై స్వదేశమునకుఁ బోయినట్లు గ్రంథనిదర్శనము గానవచ్చుచున్నది. ఇట్టివారిలో (Fa-hian) పాహియన్ (Yuwan_chang) యువన్‌చాంగు (It-sing) ఇత్సింగు అను ముగ్గురు ప్రఖ్యాతులు.

ఆ కాలమందు బౌద్ధమతమేగాక వైదికమతముగూడ
వృద్ధిగా నుండెను. హర్షుని కాలమం దీభరతఖండమంతయుఁ
బరిశుద్ధబ్రాహ్మణసమూహముచే నిండియుండె ననియుఁ,
బండితులైన బ్రాహ్మణు లందఱు సంస్కృతభాషలోనే
మాట్లాడుచుండెడువారనియు బౌద్ధమతగురువులుగూడఁ దమ
మతగ్రంథములను సంస్కృతభాషలోనే వ్రాసిరనియు యువన్
చాంగు చెప్పుచున్నాఁడు. మధ్యహిందూస్థానమందు వ్యవహ
రింపఁబడుసంస్కృతభాష పరిశుద్ధముగాను మృదుమధురముగా
నుండెను. దానికిఁ బైఁగా నున్నదేశములయందు వాడుక
చేయఁబడుభాష వికృతినొంది సంస్కారహీనమై యుండెను.
హర్షుని కాలమందుఁ గృష్ణమతావలంబులు కాణాద వైశేషిక
మతస్థులు, కాపిలులు, లోకాయతికులు, ఆర్హతులుకూడ
నుండెడివారని బాణుఁడు హర్షచరిత్రలో వ్రాసియున్నాఁడు.
హర్షవర్ధనుఁడు మతమం దభినివేశము కలవాఁడై యుండుటయే
కాక విద్వత్కవిపోషణరతుఁడనియు స్వయముగా విద్వత్కవి
యనియుఁ బ్రసిద్ధినొందెను. అతని కావ్యనిర్మాణచాతురి
వర్ణనాతీతమని బాణుఁడు వ్రాసియున్నాఁడు. అతని యాస్థా
నమం దున్నకవిగావునఁ బోషకునట్లు స్తుతించుట యాశ్చర్య
ముగాదు. కాని యీయంశము సత్యమేయని రుజువుచేయు
టకు మనకు మఱియొకసాక్ష్యము కలదు. హర్షునిమరణానంత
రము క్రీ॥ శ॥ 679-687 సంవత్సరములలో నిండియాకు వచ్చిన
'ఇత్సింగు' హర్షుఁడు సంస్కృతవాఙ్మయమందు నిష్ణాతుఁ
డనియు, సరసకవియనియు, నీతనియాస్థానమం దున్నకవు
లయిదువందలకావ్యములనుఁ రచించి యతనికిఁ గృతినొసంగి

రనియుఁ దనప్రియాణచరిత్రిలో వ్రాసెను. అతనికాల మందుఁ బుట్టినకావ్యము లన్నియు బుద్ధునిజన్మవృత్తాంతమును దెలుపును. వీనిలో నొకటి జాతకమాల. దీని నార్యసూరుఁ డనువాఁడు రచించెను. బ్రాహ్మణు లంద ఱు వేదములను శాస్త్రములను గృషిచేయువారు. ప్రథమపాఠపుస్తకమునకు "సిద్ధిరస్తు" అనిపేరు. వర్ణసమామ్నాయమునకు నలువది తొమ్మిదియక్షరములు. ఆకాలమందు విద్యార్థులకు వ్యాకరణ ప్రవేశము కలుగుట కొకచిన్నవ్యాకరణమును నేర్పెడివారు. తరువాత జయాదిత్యవిరచిత మైనకాశికావృత్తితోఁ బాణిని సూత్రములను నేర్పి పిదప శబ్దవిద్య, శిల్పస్థానవిద్య, చికిత్స విద్య, హేతువిద్య, అధ్యాత్మవిద్య యను విద్యాపంచకము నభ్యసింపఁజేయువారు. హేతువిద్యకుఁ బాఠపుస్తకము నాగార్జునుఁడు వ్రాసినన్యాయద్వార తారకశాస్త్రము, సనాందాలోఁ జదువుచున్నపుడు ఇత్సింగు పాలీభాషలో ననువదించినది యగుసుహృల్లేఖ నాగార్జునుఁడు శాతవాహనునివిషయమై వ్రాసినయొకకావ్యవిశేషము. దీనినే విద్యార్థులు తఱచుగాఁ జదువువారు. వైదికమతవిద్యార్థులు బౌద్ధమత విద్యార్థులు పూర్వోక్తము లైనయయిదువిద్యల నభ్యసించినయనంతరము వారివారిమతగ్రంథములనుగూడఁ జదువవలెను. ప్రతివాఁడు నేదోయొకవిద్యయందు గొప్పపాండిత్యమును సంపాదించి యుండవలెను. అందుకుఁగాను వ్యాకరణమందుఁ జూర్ణి యను నామాంతరము గలపతంజలిమహాభాష్యము, దానికి భర్తృహరి వ్రాసినవ్యాఖ్యానగ్రంథము, వాక్యపదీయము, ధర్మపాలుఁడు వ్రాసిన దానివ్యాఖ్యానముః, కృషిచేయవలెను.

యోగశాస్త్రమందు యోగాచార్యశాస్త్రము, అసంగుని యొసి మిదిగ్రంథములు, జినుఁడు వ్రాసిన యెనిమిది తర్కశాస్త్రగ్రంథములు, ధర్మశాస్త్రమందు షట్పాది, ఆగమములయందు నికాయచతుష్టయము- ఇవి ముఖ్యముగాఁ జదువవలసినగ్రంథములు.

మనసంస్కృతవాఙ్మయచరిత్రతో సంబంధించినగ్రంథకర్తల పేళ్లు కొన్ని హర్షునికాలమం దున్నవి. అవి యెవ్వియనిన;—వామనజయాదిత్యులు, ధర్మపాలుఁడు, నలాందాపాఠశాలాధికారి శీలభద్రుఁడు, వాసవదత్తలోను సర్వదర్శనసంగ్రహములోను జేర్పఁబడినధర్మకీర్తి, తామ్రలిప్తి, విహారాధిపతి, రత్నకూటసూత్రమును రచించిన రాహులమిత్రుఁడు, నలాందాపాఠశాలోపాధ్యాయులైన జినపుత్రుఁడు, జ్ఞానచంద్రుఁడు, భారవి, జానకీహరణకావ్యప్రణేత కుమారదాసుఁడు, మాఘుఁడు, వాసవదత్తను రచించినసుబంధుఁడు, (బాణునికంటెఁ గొంచెము ముందువాఁడు) హర్షునికి సమకాలకుఁడు, కాంచీపురము నేలినమహేంద్రవిక్రముఁ డను మహారాజు. ఇతఁడు మత్తవిలాస మనునాటకమును రచించినవాఁడు. సప్తమశతకారంభమం దుండెను. కావ్యరూపమైన యహిహోల్ శాసనమును వ్రాసినరవికీర్తి. సూర్యశతకమును వ్రాసినమయూరుఁడు, మాతంగదివాకరుఁ డనుమహాకవి మొదలగువారు.

హర్షుని నాటకములు.

రత్నావళి, ప్రియదర్శిక, నాగానందము ననుమూఁడు నాటకములను హర్షుఁడు రచించెనని చెప్పుట కనేకాధారము

లున్నవి. అందులో మొట్టమొదట (Keitte's Sanskrit Drama page 170) 'There is absolute similarity of style and tone, in the three works which renders any effort to dissolute them wholly impossible " అని వ్రాసినాఁడు. రత్నావళీప్రియదర్శికలు రెండును నాటికలు. ఈరెండింటికి వత్సరాజుకథయే ప్రధాన ప్రతిపాద్యము. నాగానందము నాటకము. మూఁడింటికిఁ బ్రస్తావన సమానము. " శ్రీహర్షో నిపుణః కవిః పరిషద ప్యేషా గుణగ్రాహిణీ " యనియున్నది.

హర్షుఁడు మొదటఁ దాను నిశ్చయించుకొన్నట్లు బౌద్ధ మతాభిముఖ్యము గలవాఁడయ్యెను. బంగాళాదేశమం దున్న రాజమహాలులో నివసించుచున్న యువన్ చాంగు దగ్గఱ మహాయానబౌద్ధమతమును గుఱించి యుపదేశమును బొందెను. తన పూర్వు లందఱు శైవసూర్యతంత్రాదినిష్ఠులైయున్నను మహాయానబౌద్ధమతాభివృద్ధికొఱకుఁ గనోజిలో నొకపెద్దసభను గావించి హిందూదేశమం దున్నసర్వమతస్థులను రావించి యువన్ చాంగుచే నుపన్యాసముల నిప్పించెను. ఆసభయందుఁ దనమిత్త్రుఁడైన ఆసామ్ పదునెనమండ్రుగు రితరసామంత రాజులు మూఁడువేలమంది బ్రాహ్మణులు వెయ్యిమంది బౌద్ధపండితులు మూఁడువేలమంది మహాయానహీనయాన బౌద్ధసన్యాసులు వచ్చియుండిరి. అపుడు యువన్ చాంగు గంభీర భాషణములతో నుపన్యాసము నారంభించి తా నుపన్యాసములో యుక్తిసహముగానిమాటలను జెప్పననియు నీసభలో నెవ్వఁడైన నిది యుక్తిహీన మయినమాట యని నాకుఁ

దెలియఁజేసినచో వానికి నాతల నిచ్చెదననియుఁ బ్రతిజ్ఞను వ్రాసి యొకబల్లగట్టించెను. అయిదుదినములవఱకు సభ నెమ్మదిగా జరిగెను.ఆఱవదినమందు యువన్ చాంగుప్రాణద్రోహము విషయమై సభలో నొకమూల కుట్ర జరుగుచున్నదని కని పెట్టి చక్రవర్తి " యాత్రికుని కెవ్వఁడైన హానిగలిగించినచో వాఁడు వధ్యుఁడనియు, నుపన్యాసకునికి విరుద్ధముగా మాట్లాడినవానిజిహ్వ ఛేదించఁబడుననియు" సభలోఁ జాటించెను. అందుపైని విరోధివర్గము సభామందిరమును పడిచిపెట్టి పైకిఁ బోయెను. మఱిపదునెనిమిది దినములు సభ నెమ్మదిగా జరిగెను. ఏడాదికొకసారి తనదేశమం దున్నబౌద్ధపండితుల నందఱిని రావించి యొకపెద్దసభ గావించుచుండెను. అనేకస్థలములయందు బౌద్ధవిహారములను నిర్మించెను. బుద్ధునిదంతము నొకదానిని గాశ్మీరదేశమునుండి బలాత్కారముగాఁ దీసికొని వచ్చి కనోజికి సమీపభాగమందు నిర్మించఁబడిన యొకవిహారములోఁ బ్రతిష్ఠించెను. ఇట్లుహర్షుఁడు బౌద్ధమతమం దధిక భక్తిగలవాఁడై యున్నను వైదికమతములయందు విరోధము లేనివాఁడై యుండెను. అనేక బ్రాహ్మణసంఘములను బోషించెను. అయిదేండ్ల కొకసారి మోక్షసభయని యొకపెద్దసభ గావించుచుండెను. ఫిరంగులు, ఆయుధములు మొదలగు యుద్ధసామగ్రితప్పఁ దక్కినతనసొత్తంతయును మతాభివృద్ధి కొఱకే వ్యయపర్చెను హర్షునిమహౌదార్య మతనిధర్మకార్యములయందే కానవచ్చుచున్నది. తనరాజ్యమం దున్నపట్టణములలోను బల్లెలలోను బుణ్యశాలలు నిర్మించెను. వానిలో బాటసారుల కన్నపానాదు లొసఁగఁబడెను. వైద్యశాలలు

నిర్మించి రోగులకు మందు లిప్పించెను. బాణుఁడుకూడ నితఁడొనర్చినలోకోపకారములను ధర్మకార్యము లను బ్రజాపాలనదక్షతను సవిస్తరముగా వర్ణించెను. కలియుగనిదాఘసంతాపమ్లాన మగుధర్మతరు వీతనికాలమందు నవీభూతమై శతశాఖముగాఁ బ్రబలి ఫలించెను. బాణుఁడుగాక యితనియాస్థానమందు హరిదత్తుఁడు జయసేనుఁడునని మఱియిద్దఱు మహాపండితు లుండిరి. వీరిలో జయసేనుఁడు సర్వజ్ఞుఁడని చెప్పఁదగినవాఁడు. ఇతనికిఁ జక్రవర్తి ఒరిసాదేశమందెనిమిది గొప్పపట్టణములరాఁబడిని గుటుంబపోషణమునకై యిచ్చెను. యువన్ చంగునెడలఁగూడ రాజమర్యాదలను జరిపెను. కనోజిలో జరిగినసభ ముగిసినతరువాతఁ జక్రవర్తి యితనికిఁ బదివేల మొహర్లను, ముప్పదివేలరూపాయీలను నూఱుదుస్తులను బసదన మొసంగెను. అతనియుపన్యాసములను విన్నతక్కిన సామంతరాజులతనికి రత్నాభరణముల నొసంగిరి. కాని పరమ విరక్తుఁ డగునాతఁ డెద్దియుఁ బరిగ్రహించలేదు. హర్షుఁడు తనసాంవత్సరికాదాయములో నాల్గవపాలు విద్యావిషయమందు మఱియొకనాల్గవపాలు మతవిషయమందు ఖర్చుపెట్టెను. ప్రజలకిట్టిలాభములు హర్షునిరాజ్యపాలనసామర్థ్యమువలనఁ గలిగినవి.

ఈచక్రవర్తికిఁ గృష్ణుఁడనుమఱియొకసోదరుఁడు నొక పుత్రుఁడు నొకపుత్రికయు నుండెనని బాణుఁడు చెప్పియున్నాఁడు. ఈకుమార్తెను వలభిరాజైనధ్రువభట్టునికిచ్చి వివాహముచేసెను.

ఇట్లు దిగంతవిశ్రాంతకీర్తిని సంపాదించి యవ్యాహత ముగా ముప్పదిసంవత్సరములు రాజ్యమేలినహర్షసమ్రాట్టు

" నాదా కించి ద్భవతి నియతం యస్య పశ్చాన్నకించి ।
స్వద్వైకస్మా త్సపది ఘటయు న్సాన్వయాదాస్థ్యానబోధమ్ ।
నిశ్శబ్దానాం ఘ్రి స్సటయతి ముహుః కోపి జంతు ర్నటిత్వా ।
నోజానిమో భవజనని రాంతో నిత్యః క్వ ప్రియాతి ।

(కల్హణుని రాజతరంగిణి - సప్తమతరంగము 1731 శ్లో)

అనుకల్హణవచనమును స్మరింపఁ జేయుచు, క్రీ॥ శ॥ 655 సంవత్సరములోఁ గీర్తిశేషుఁ డయ్యెను.

## కృతివిమర్శనము.

బాణకృతకాదంబరీహర్ష చరిత్రములను ప్రాచీనాంధ్ర కవు లెవ్వరు నాంధ్రీకరించినట్లు కానరాదు. ఒకవేళ నాంధ్రీ కరించియున్న నాపుస్తకములు కాలక్రమమున నంతరించి యుండవచ్చును. ఆధునికు లిద్దఱు కాదంబరిని దెనిఁగించి యున్నారు. ఆఱుసంవత్సరముల క్రిందట నేను హర్షచరిత్రి మును వచనరూపముగాఁ దెనిఁగించితినిగాని పద్యరూప ముగా వ్రాయుటకుఁ దగినంతసాహసము లేకపోయెను. ఇపుడు మాప్రియమిత్రులు గుంటూ రాంధ్రక్రైస్తవకళాశాలలో నాంధ్రభాషాధ్యాపకులు, నిరర్గళసరసకవితాసామ్రాజ్యపట్ట భద్రులు నగు శ్రీమాన్ కొమాండూరి కృష్ణమాచార్యులవా రింతకాలమునకు హర్షచరిత్రమును జక్కనిశైలిలోఁ బద్య రూపముగా నాంధ్రీకరించిరి. వీ రీపని నేఁడెనిమిదేండ్లక్రింద టనే మొదలిడిరి. భారతిలోఁ బ్రకటింపఁబడిన వీరిపద్యములఁ

గొన్నింటినిఁ జదివి యానందించితిని. వీరికవితాశైలి మధ్య కవులశైలిని బోలి సరసమై నిగ్గుష్టమై కానవచ్చుచున్నది. శైలి సంస్కృతపదభూయిష్ఠము. ప్రబంధమం దెల్లెడల నోజః ప్రసాదమాధుర్యాదిగుణము లుల్లసిల్లుచున్నవి. కొన్నిచోట్లఁ బెద్దనశ్రీనాథప్రభృతుల మార్గములు చూపట్టుచున్నవని నుడివినచో సత్యోక్తిపక్షపాతోక్తియుఁ గానేరదు. దుర్ఘట మగుస్వర్ణసౌగంధ్యసంయోగమువలె వీరియం దనవద్యవిద్యా పాండితి నిరర్గళకవితాధోరణి చిత్రముగాఁ గలిసియుండుట మిక్కిలియాశ్చర్యకరము.

ఆనందవర్ధనాచార్యులు ధ్వన్యాలోకమందు "స్వేచ్ఛా కేసరిణ స్వచ్ఛస్వచ్ఛాయాయాసితేందవః। త్రాయంతాం వో మురరిపోః ప్రపన్నార్తిచ్ఛిదో నఖా" యనినృసింహనఖ స్తుతిని సల్పినట్లాచార్యులవారుకూడ గ్రంథాదియందు నృసింహనఖములనే స్తుతించిరి. ఇది యొకక్రొత్తదారి. గ్రంథకర్త గారు విశిష్టాద్వైతసంప్రదాయాభిజ్ఞు లగుశ్రీవైష్ణవోత్తములు గావున నాముక్తమాల్యదయందుఁ గృష్ణరాయనివలె వీరును కృత్యాదియందనంతగరుడవిష్వక్సేనాదులను నమ్మాళ్వార్లను బంచాయుధములను గురుపరంపరను స్వాచార్యులను స్తుతించిరి. వీ రాంగ్లేయభాషాకోవిదులై యుండి యధునాతననాగర కత్వాశ్రియులై యుండి తమప్రబంధమందుఁ బ్రాచీనపద్ధతినే సకలవిధముల నవలంబించినందుకు వీరిమతభక్తి, పూర్వాచారపరాయణత్వము వేయినోళ్ళఁ బొగడఁదగి యున్నది.

ఇఁక వీరియాంధ్రీకరణ మెట్లున్నదో చూతము.

వీరు మాతృకయం దున్న ధ్వాంతసపువర్ణనలఁ బోనాడి సారతరమైనకల్పనలనే గ్రహించి తెనిఁగించియున్నారు. అందువలనఁ బాఠకులు చదువుటకుఁ బ్రలోభితులగుదురని నా యుద్దేశము. అందుచే నీకృతి గ్రంథకర్తగారి స్వకపోలకల్పితముగాఁ గానవచ్చుచున్నదిగాని యాంధ్రీకరణమువలెఁ గానరాదు. వీరియభిధానశక్తి, వచఃపరిపాటి మిక్కిలి యెన్నఁదగినవి. భాష యీయాయిప్రకరణమునకు, నాయాయిరసమునకు నుచితముగా నున్నది. హెచ్చు వ్రాసినచో గ్రంథవిస్తరమగునని భీతిల్లి స్థాలీపులాకన్యాయముగా నీదిగువ రెండు గద్యల యాంధ్రీకరణమునే చూపించుచున్నాను.

తృతీయోచ్ఛ్వాసము.

శరదృతు వర్ణనము.

మూ॥ అథ కదాచి ద్విరళితబలాహకే చాతకాతంకకారిణి క్వణత్కాదంబే దర్దురద్విషి మయూరమదముషి హంసపథికసార్థసర్వాతిథౌ ధౌతాసినిభనభసి భాస్వరభాస్వతి శుచిశశిని తరుణతారాగణే గళత్సునాసీరశరాసనే సీడత్సౌదామినీదామ్ని దామోదరనిద్రాద్రుహి ద్రుతవైడూర్యవర్ణార్ణసి ఘూర్ణమానమిహికాలఘుమేఘమోఘమఘవతి నిమీలన్నీపే నిష్కుసుమకుటజే నిర్ముకుళకందళే కోమలకమలే మధుస్యందిందీవరే కల్హారాహ్లాదిని శేఫాలికాశీతలీకృతనిశే యూథికామోదిని మోదమానకుముదావదాతదశదిశి సప్తచ్ఛదధూళిధూసరితసమీరే స్తబకితబంధురబంధూకాబధ్యమానాకాండసంధ్యే నీరాజితవాజిని ఉద్ధామదంతిని దర్పక్షీ

ఔత్సుకే క్షీయమాణపంకచక్రవాళే బాలపుళినపల్లవితసింధు రోధసి పరిణామశ్యానశ్యామాకే జనితప్రియంగుమంజరీ రజసి కఠోరితత్రపుసత్వచి కుసుమస్మేరశరే శరత్సమయారంభే రాజ్ఞ స్సమీపా ద్బాణో బంధూన్ ద్రష్టుం పునరపి తం బ్రాహ్మణాధివాస మగాత్.

ఆంధ్రీకరణము

శా. ధౌతాసిప్రతిమాంబరంబు విగళత్సౌదామనీదామము
ద్ధూతాంభోధరమండలం బహిమరుద్దుర్వారభాస్వత్కర
స్ఫీతాంభోరుహషండసంగతరటద్భృంగీసమారబ్ధసం
గీతం బొప్పె శరత్సమాగమము లక్ష్మీకాంతనిద్రాంతమై॥

ఉ. చాతకలోకభీకరము చంద్రికశూన్యశిఖావళంబు ని
ర్ధూతసురేంద్రకార్ముకము దుర్దినకర్దమమర్దనాతపం
బాతపహంససారసరవాకులపాంథజనంబు యూధికా
వ్రాతసుగంధిమారుతము భాసురమయ్యె శరద్దినం బిలన్॥

ఉ. చారుతుషారబింబరుచిసాంద్రములు న్పరిపక్వశాలికే
దారము లుల్లసత్తరళతారకపంక్తులు ఫుల్లమల్లికా
హారులు మోదమానకుముదాకరము ల్సరపుష్పరేణుసం
భారసమీరముల్ వొలిచె భాసురశారదవాసరావళుల్॥

గ్రంథకర్తగారు పైగద్యలో ముఖ్యాంశములనే గ్రహించి యాంధ్రీకరించిరి.

ప్రథమోచ్ఛ్వాసములో మాలతి సరస్వతీసకాశమునకు వచ్చి దధీచియొక్క విరహవేదనను వర్ణించి చెప్పుట.

సా త్వవాదీత్ - దేవి ! జానాస్యేవ మాధుర్యం విష యాణాం లోలుపతాం చేంద్రియగ్రామస్య ఉన్మాదితాంచ నవయౌవనస్య । పారిప్లవతాంచ మనసః । ప్రఖ్యాతైవ మన్మథస్య దుర్నివారతా; అతో నమాముపాలంభే నోపస్థాతు మర్హసి । నచ బాలిశతా చపలతా చారణతా వా వాచాలతాయాః కారణం । సకించి న్నకారయ త్యసాధారణా స్వామిభక్తిః । సా త్వం దేవి యదైవ దృష్టాసి దేవేన తత ఆరభ్య అస్య కామో గురుః । చంద్రమా జీవితేశః । మలయమరుదుచ్ఛ్వాసహేతుః । ఆధయోఽ స్తరంగస్థానేషు । సంతాపః పరమసుహృత్ , ప్రజాగర ఆప్తః । మనోరథా స్సర్వగతాః । నిశ్వాసా విగ్రహాగ్రేసరాః । మృత్యుః పార్శ్వవర్తీ । రణరణక స్సంచారకః । సంకల్పా బుద్ధ్యుపదేశవృద్ధాః । కింవా విజ్ఞాపయామి - అనురూపో దేవ్యా ఇత్యాత్మసంభావనా । శీలవానితిప్రక్రమవిరుద్ధం । ధీర ఇత్యవస్థావిపరీతం । సుభగ ఇతి త్వదాయత్తం । స్థిరప్రీతిరితి నిపుణోపక్షేపః । జానాతి సేవితు మిత్యస్వామిభావోచితం । ఇచ్ఛతి దాసభావ మామరణాత్కర్తుమితి ధూర్తాలాపః । భవనస్వామినీ భవసీ త్యుపప్రలోభనం । పుణ్యభాగినీ భజతి భర్తారం తాదృశమితి స్వామిపక్షపాతః । త్వం తస్య మృత్యురి త్యప్రియం । అగుణజ్ఞాసీ త్యధిక్షేపః । స్వప్నేఽస్య బహుశః కృతప్రసాదాసీ త్యసాక్షికం । ప్రాణరక్షార్థ మర్థయత ఇతి కాతరతా । తత్రాగమ్యతా మిత్యాజ్ఞా । వారితోఽపి బలా దాగచ్ఛతీతి పరిభవః । తదేవ మగోచరే గిరామసి ఇతి శ్రుత్వా దేవీ ప్రమాణ మిత్యభిధాయ తూష్ణీ మభూత్ ।

గ్రంథకర్తగా రింతపెద్దగద్యముయొక్క యర్థమును మూడుపద్యములలో నెట్లుసంగ్రహించిరో చూడుఁడు.

ఆంధ్రీకరణము.

సీ. విషయమాధుర్యంబు వెలఁది ! తెల్లముకాదె
యింద్రియచాపల్య మెఱుకపడదె
నవయౌవనోన్మాద మవధరింపవె దేవి !
చిత్తచాంచల్యంబు గొ్రత్త యగునె
మన్మథహాతకునిమాహాత్మ్య మెఱుఁగవే
దక్షిణానిలుమాట దలఁపవలెనె
విరహాతాపభరంబు వింతయె కళ్యాణి !
యావసంతునిరంతు లడుగవలెనె

గీ. కాన నాపైని నిందలఁ గట్టవలదు
చపలతయు బాలిశతయును జారణతయు
నాదువాచాలతకుఁ గారణంబు గాదు
ఏమిసేయింప దూర్జతస్వామిభక్తి ?

ఉ. ఆమునినాథనందనుని కమ్మ ! నినుం గనుటాదిగాఁగ నా
కాముఁడె యొజ్జ జీవితము కైరవనాథునిసొమ్ము దేవి ! నే
నేమనిచెప్పుదాన భవదీక్షణలేశము ప్రాపుగల్గినన్
స్వామి చిరాయువౌను మునిచంద్రునిసంతతి శాశ్వతంబవున్

సీ. అనురూపుఁడో వరుం డతఁడని వచియింప
నాత్మసంభావనం బదియకాదె
శీలవంతుఁ డటంచుఁ జెప్ప నొప్పును గాని
యది పరిక్రమవిరుద్ధ మగుట నిజము

సుభగుఁ డాతండని సూచింతు నంటినా
యామాట నీనోట నసఁగవలయు
ధీరచిత్తుఁ డటంచుఁ దెల్పఁగూడును గాని
పరిస్థితస్థితి కది పడనిమాట

గీ. దాస్యమును గోరె ననుట ధూర్తపరిలాప
మార్య! రక్షింపుమనుట కాతర్య మగును
గలల నినుఁ గాంచు ననుటకుఁ గలదె సాక్ష్య
మట్లుగావునఁ బలుకంగ నలవిగాదు॥

ఆచార్యులవారు కొన్నిచోట్ల సంగ్రహముగానున్న కవియభిప్రాయమును హృదయంగమ మగురీతిగా వివరించి పెంచియున్నారు. ఎట్లనఁగా: చతుర్థాశ్వాసము - మూలములో - "హూణహరిణ కేసరీ, సింధురాజజ్వరః, గుర్జరప్రజాగరః, గాంధారాధిపగంధద్విపకూటపాకలః, లాటపాటవపాటచ్చరః, మాలవలక్ష్మీలతాపరశుః,

సీ. గాంధారరాజేంద్రగంధహస్తికిఁ గూట
పాకలం బెవనితీవ్రప్రతాప
మహితహూణకురంగహర్యక్షగర్జాని
నాద మెవ్వనిజయానకరవంబు
ప్రాజ్యమాలవమహారాజ్యలక్ష్మీలతా
పరశు వెవ్వనిదీర్ఘభయదహేతి
సింధుమహీనాథసింధునిర్మథనోరు
మంథాన మెవ్వనిమహితభుజము

గీ. చకితగూర్జరనరనాథజాగరంబు
లెవని ఘోటకఘట్టికా హేష లతఁడు
తనరె రాజాధిరాజప్రతాపశాలి
బిరుదములతోఁ బ్రభాకరాభిఖ్య నతఁడు॥

ఇట్టి కావ్య మెచ్చటఁ జూచినను గుణబహుళము, దోషశూన్యము. ఇఁక వెయ్యేల ఈప్రబంధమందు గ్రంథకర్తగారిపేరును బ్రకటింపక విడిచినచోఁ బాఠకమహాశయులందఱు "ఆహా యిది యేమికవనము ! దీని నెవ్వఁడో ప్రాచీనాంధ్రకవి రచించియుండును. ఇతని నామధేయముగాని యితనివృత్తాంతముగాని యెద్దియు మనకుఁ దెలియదే" యని పలుకకమానరు. ఇదివఱకే నావ్యాస మతివిపులమైపోయినదని లజ్జించుచు నింతతో విరమించుచున్నాఁడను. ఆచార్యులవారు కాదంబరినిగూడ నాంధ్రీకరించి యాంధ్రభాషాయోషామతల్లిని గైసేయుదురని నాయాశంస. ఇట్టిమహాకవులకు సర్వేశ్వరుఁ డాయురారోగ్యపుత్రపౌత్రాదిసంపదల నిచ్చి సర్వకాలము రక్షించుచుండవలయునని ప్రార్థించు

విజయనగరము,
24-5-1935.

భాగవతాంఘ్రిరేణువు,
మేడేపల్లి వెంకటరమణదాసుఁడు,
*Senior Sanskrit Pandit,*
**Maharaja's College.**

శ్రీయజ్ఞపతయే నమః

# ఆంధ్రహర్షచరిత్ర

## ప్రథమాశ్వాసము



శ్రీసంధాయకముల్ నిజాశ్రితులకున్
శృంగారపత్రక్రియన్
హ్రీసంధాయకముల్ రమాసతికి దై
త్యేంద్రాంగనా పాళికిన్
ధీసంధాయకముల్ హిరణ్యజునకున్
విజ్ఞానసంపద్ఘన
శ్రీసంధాయకముల్ నృసింహునఖముల్
సేవింతు నశ్రాంతమున్. 1

చ. చరణయుగంబు దేవికరసంపుటగర్భమునుండి లాగి యా
దరమున నిచ్చు సైన్యపతిదక్షిణహస్తముఁ బోవఁద్రోచి బం
గరుమణిపాదుకల్పదయుగంబునఁ దాల్పక హస్తిరత్నగా
తురత ఖగేంద్రునిం దఱుముతోయజనేత్రుఁ డొసంగుతన్
[ సిరుల్. 2

చ. హరివిభవావతారములయం దనపాయినియై జగంబులన్
బరమదయార్ద్రదృష్టుల నవారణఁ బ్రోచుచుఁ జేతనావళిన్
బరమపదాధినాథునికృపారసపాత్రముఁ జేయుదుగ్ధసా
గరసుత మా కొసంగుత మఖండకవిత్వవిలాససంపదల్. 3

సీ. హరికి లీలావిహారావసరంబుల
ఘనసితచ్ఛత్రవిగ్రహముఁ దాల్చి
అమలసౌధములె సుఖాసీనుఁ డౌనెడ
బహురత్నపీఠరూపము వహించి
సిరిఁ గూడి సుఖనిద్రఁ జెందు వేళలయందు
లలితపర్యంకవిలాస మూని
కలశాబ్ధిఘనతరంగముల మాధవునకు
మణిడోలికావిభ్రమము ధరించి

గీ. నిజఫణారత్నదీపికానికరములను
భూరితేజంబు వైకుంఠమునకుఁ గూర్చి
హరికి సకలంబు తానయై యతనిఁ గొలుచు
నయ్యనంతుని దలఁతు హృదంతరమున. 4

ఉ. ఖండితపార్ధిసంఘములు భీకరవేగపతద్గ్రహావళుల్
ఖండితమేరుశృంగములు గాఢరయాకులదేవసంఘముల్
చండరయభ్రమద్భగణచక్రము లాఖగరాజశైశవో
ద్దండవిహారముల్ వృజినవర్గములన్ విదళించుఁగావుతన్.

మ. హరి సేవింపఁగవచ్చు బ్రహ్మముఖ దేవాధీశసమ్మర్దమున్
వరవేత్రాంచలచాలనంబులను తా వారించుచున్ నేత్రకో
ణరుచిన్ శ్రీపతిచిత్తవృత్తిఁగని విన్నాణంబు సంధిల్లు నా
పరమోదారుని సైన్యనాథు నెదలో భావింతు నశ్రాంతమున్.

ఉ. మాలిగదాహతిన్ రణము మాలి విహంగమ మాళి దూల దే
వాలి భయంబున న్వడఁక నాశరవీరజయానకార్భటుల్
గ్రాల హరిప్రయుక్తమయి రాక్షసకంఠవిదారణక్రియా
పాలితసర్వలోక మగుభాసురచక్రము నాశ్రయించెదన్. 7

మ. సమరక్షోణిసముత్థితాసురచమూసంఘాతమాతంగయూ
థమహౌద్ధత్యము వాప శ్రీహరిముఖాధ్మాతోదరంబై దిగం
తమ దేభోత్కరకర్ణరంధ్రదళనోద్దామధ్వనిన్ దైత్యసై [డున్.
న్యములందోలెడు పాంచజన్య మొసఁగున్ భద్రంబు మాకెప్పు

మ. కనకాద్రిప్రతిమానసారము, జగత్కల్యాణసంపాది, దై
త్యనికాయోజ్జ్వలధూమకేతుశిఖ, సాళ్వాధీశకామోచ్చల
ద్ఘనవైహాయసలోహమందిరమహోల్కాపాత మయ్యాదవేం
ద్రుని కౌమోదకి మాకఖండశుభసందోహప్రదం బయ్యెడున్.

ఉ. శౌరిసుదీర్ఘపీవరభుజాభుజగోత్తమజిహ్వికాకృతిన్
ఘోరరణాంగణంబుల నకుంఠితవిక్రము లైనదైత్యరా
డ్వీరులప్రాణవాయువుల వేగమ పీల్చుము రారినందక
స్ఫారకఠోరధార కలుషప్రకరంబు లడంచుఁగావుతన్. 10

మ. విలసజ్జ్వాలతికాకడారచపలావిభ్రాజితం బాశుగో
జ్జ్వలవర్షంబు గుణారవోగ్రకులిశధ్వానంబునై క్రవ్యభు
క్కులమత్క్షేత్రములన్ శరార్ణవనిమగ్నధ్వస్తముల్ సేయునా
జలజాతేక్షణుశార్ఙ్గమేఘ మఘపాళశ్రేణి భంజించుతన్.

ఉ. చారుహిరణ్మయాకృతిని శౌరిహృదబ్జముల న్వసింపఁగా
భూరికృపామతిన్ గలిసముత్థితదోష మడంపఁగోరి వి
స్తారనిజప్రకాశము సుదక్షిణమై వెలుఁగంగ లోకర
క్షారతి నుర్వికిన్ దిగినసత్పథవర్తులఁ గొల్తు సూరులన్.12

ఉ. సారతరార్థసంపదల సర్వజనాదరణీయమై త్రయీ
సారముగా సహస్రముఖశాఖల ద్రామిడవేదసంహితా
క్ష్మారుహ ముర్వి మోక్షమయచారుఫలంబుగ నిల్పి ఘోరసం
సారమరుస్థలార్తులకు ఛాయనొసంగుశఠారిఁ గొల్చెదన్.13

శా. శ్రీమన్నాథముని న్సరోజనయనున్ శ్రీరామమిశ్రుం గుదృక్
స్తోమధ్వాంతదినేశు యామునముని, న్దుర్వాదిగర్వాపహున్
శ్రీమల్లక్ష్మణయోగిదేశికమణిన్ శేషావతారున్ శ్రుతి
స్తోమాపీడగురూత్తమున్ దలఁతు నస్తోకప్రభావాఢ్యులన్.

కం. శ్రీమదహోబిలనరసిం
హామలపదకమలయుగసమారాధనదీ
క్షామహితుల మద్గురులన్
రామానుజదర్శనైకరసికులఁ గొల్తున్. 15

చ. హరిమొదలాత్మదేశికవరాంతముగాఁ గలదేశికావళిన్
శరణ మొసంగ వేఁడి యఘనాశనపూర్వకవిప్రకాండులన్
గర మనురక్తి మ్రొక్కి మురఘస్మరునిన్ గృతిభర్తఁ జేసి కా
వ్యరసికసేవ్యమౌపగిది హర్షచరిత్ర మొనర్తు నాంధ్రమున్.

గీ. స్వాదు 'కాదంబరీ'రసాస్వాదమునను
బూర్ణ మగుప్రజ్ఞ వాయనిబుధవరులను,
శాబ్దికులఁ గావ్యవేత్తల సరసకవుల
లాక్షణికులను దలఁతు సలక్షణముగ. 17

కం. పాంచాలీకీతుల సువి
పంచీస్వరమధుర మగుచుఁ బ్రౌఢోక్తులతో
మించినబాణునిభణితి వి
రించిస్తవనీయ మన సరే యనరె బుధుల్. 18

గీ. వాణియవతార మగుభట్టబాణుకృతిని
దెలుఁగు సేయంగ నను బోటి దివురు టరయ
వీఁక నిజభుజశక్తి రత్నాకరంబు
దాఁటఁ దలపోయునట్టివిధంబు గాదె. 19

గీ. వ్యాసవాల్మీకికాళిదాసాదిసుకవి
నిర్మితగ్రంథసందర్భనిధులు గనియుఁ
గవులు నిరపత్రపామతిఁ గవితఁ జెప్పి
రట్లె దలఁపుఁడు సహృదయు లాత్మకృతిని. 20

వ. అని యిష్టదేవతాప్రార్థనంబును సనాతనాధునిక విద్వత్కవివందనంబును గావించి. 21

## —* షష్ఠ్యంతములు *—

కం. శ్రీభూనీళావిభునకు
నాభీసరసీజపృథుకనానాశ్రితపుం
జాభివ్యక్తగుణాళికి
మాభర్తకు భక్తలోకమందారునకున్. 22

కం. దామోదరునకుఁ దులసీ
దామోదారునకు భక్తదామార్పణశీ
లామోదప్రదునకు వకు
ళామోదమునీంద్రవాక్సుధారాధ్యునకున్. 23

కం. నరపంచాననమూర్తికి
ఖరనఖరత్రుటితదితిజఘనవక్షునకున్
కరుణాంభోధికి లక్ష్మీ
కరపరిచితచరణయుగళకంజాతునకున్. 24

కం. ఖరదంష్ట్రాగ్రవిదారిత
సురవైరిహృదంతరాళశోణితకాశ్మీ
రరసపరిలిఖితపత్రాం
కురభూషితభూవిశాలకుచభాగునకున్. 25

కం. చరణాంభోరుహనిర్గత
సురధునికిఁ ద్రివిక్రమోపశోభితమూర్తికిన్
వరపదసరసిజనమితా
సురమౌళికి ద్రుహిణసేవ్యశుభచరణునకున్. 26

కం. చండకుఠారాంచితభుజ
దండవిఖండితసమగ్రధరణీశకురుట్
షండునకుఁ గార్తవీర్యో
ద్దండభుజారణ్యజటిలదావానలునకున్. 27

కం. జ్యారావరౌద్రచాపనిర్గత
నారాచవిఖండితోగ్రనక్తంచరకం
ఠారణ్యునకు మహేశ్వర
సారధనుర్భంగశౌర్యసారభుజునకున్. 28

కం. కలితోరువారుణీమద
చలితస్వాంతునకు, బాహుశాలికి, హాలికిన్
హాలకర్షితకాళిందీ
జలపూరతరంగఘటితజయశబ్దునకున్. 29

కం. నవనీతమిషాహృతగో
పవధూహృదయునకు భక్తవత్సలునకుఁ బాం
డవమధ్యమసారథ్య
ప్రవణునకు కనుదాంతకునకుఁ బద్మాక్షునకున్. 30

కం. మందరధరునకు లక్ష్మీ
సుందరవదనారవిందసూర్యునకు సుధా
నందితసురబృందునకును
నందకిశోరునకు దేవనాయకమణికిన్. 31

కం. దశరూపకుశీలవునకు
దశరథతనయునకు, రామధరణీశునకున్
దశవదనదహనునకు నిజ
దశనోద్ధృతసకలభూతధాత్రికి హరికిన్. 32

వ. సమర్పితంబుగా నాయొనర్పంబూనినహర్షచరిత్రంబునకుం
గథాక్రమం బెట్టిదనిన. 33

( భట్టబాణుని మంగళాచరణము )

గీ. చంద్రచామరచారుశీర్షమున నొప్పి
భువనపురమున కాధారభూత మైన
మూల మగుకంబ మన నొప్పునీలగళుని
చరణపంకజములకు నంజలి యొనర్తు. 34

మ. హరకంఠగ్రహణాత్తమోదమున నేత్రాబ్జంబుల న్మూసి త
ద్గరళస్పర్శవికారసంజనితసంతాపార్తి మూర్ఛిల్లిన
ట్లురమం దూరక వ్రాలియుండినయపర్ణోదారపాదాబ్జయు
గ్మరజోలేశములన్ నమస్క్రియలసంభావింతునశ్రాంతమున్

గీ. భారతీవర్ష మన నొప్పు భారతంబుఁ
బరఁగ నొనరించి కవిఖ్యాతిపదమునందుఁ
బట్టమును గట్టుకొన్న యాభవ్యమూర్తి
సత్యవతిసూనుఁ దలఁతు హృత్సరసిజమున. 36

గీ. కామకారులు రాగసంకలితదృష్టు
లధికవాచాలు రుర్విఁ బికాళివోలెఁ
గొసరి కూతురు కుకవు లాకుత్సితంపుఁ
బలుకులకుఁ దత్త్వవిదులు లోఁ గలఁతపడరు. 37

గీ. జాతిమాత్రులు కుక్కురసమజమ్ముల్లు
గలరు కుక్షింభరులు ప్రీతినిలయమందు
శరభములు వోలె ధరణిలో సరుదుగారె
యభినవోత్పాదకులు కవు లరసి చూడ. 38

గీ. అన్యవర్ణపరావృత్తి నాశ్రయించి
బంధచిహ్ననిగూహనపటిమ మెఱసి
తా ననాఖ్యాతుఁ డయ్యును దక్షణంబ
సుజనగోష్ఠి బయల్పడుఁ జోరుఁ డెపుడు. 39

గీ. ఔత్తరాహులకవనంబునందు శ్లేష
మర్థమాత్రంబె వరుణదిగాశ్రితులకు
దాక్షిణాత్యులలోన యుత్ప్రేక్షబలము
అక్షరాడంబరము గౌడులందు నిజము. 40

కం॥ మందరధరునకు లక్ష్మీ
సుందరవదనారవిందసూర్యునకు సుధా
నందితసురబృందునకును
నందకిశోరునకు దేవనాయకమణికిన్. 31

కం. దశరూపకుశీలునకు
దశరథతనయునకు, రామధరణీశునకున్
దశవదనదహనునకు నిజ
దశనోద్ధృతసకలభూతధాత్రికి హరికిన్. 32

వ. సమర్పితంబుగా నాయొనర్పంబూనినహార్షచరిత్రంబునకుం
గథాక్రమం బెట్టిదనిన. 33

( భట్టబాణుని మంగళాచరణము )

గీ. చంద్రచామరచారుశీర్షమున నొప్పి
భువనపురమున కాధారభూత మైన
మూల మగుకంబ మన నొప్పునీలగళుని
చరణపంకజములకు నంజలి యొనర్తు. 34

మ. హరకంఠగ్రహణాత్తమోదమున నేత్రాబ్జంబుల న్మూసి త
ద్గరళస్ఫు ... మూర్ఛిల్లిన
ట్లురమం దూరక వ్రాలియుండినయపర్ణోదార పాదాబ్జయు
గ్మరజోలేశములన్ నమస్క్రియలసంభావింతునశ్రాంతమున్

గీ. భారతీవర్ష మన నొప్పు భారతంబుఁ
బరఁగ నొనరించి కవిధాత్రుపజ్ఞమునందుఁ
బట్టమును గట్టుకొన్న యాభవ్యమూర్తి
సత్యవతిసూనుఁ దలఁతు హృత్సరసిజమున. 36

గీ. కామకారులు రాగసంకలితదృష్టు
లధికవాచాలు రుర్విఁ బికాళివోలెఁ
గొసరి కూతురు కుకవు లాకుత్సితంపుఁ
బలుకులకుఁ దత్త్వవిదులు లోఁ గలఁతపడరు. 37

గీ. జాతిమాత్రులు కుర్కురసమజముల్లు
గలరు కుక్షింభరులు ప్రతినిలయమందు
శరభములు వోలె ధరణిలో నరుదుగాని
యభినవోత్పాదకులు కవు లరసి చూడ.

గీ. అన్యవర్ణపరావృత్తి నాశ్రయించి
బంధచిహ్నానిగూహనపరత మెఱసి
తా ననాఖ్యాతుఁ డయ్యును దత్క్షణంబ
సుజనగోష్ఠి బయల్పడుఁ జోరుఁ డెప్పుడు. 39

గీ. ఔత్తరాహులకవనంబునందు శ్లేష
మర్థమాత్రంబె వరుణదిగాశ్రితులకు
దాక్షిణాత్యులలోన యుత్ప్రేక్షబలము
అక్షరాడంబరము గౌడులందు నిజము. 40

గీ. జాతి నగ్రామ్యతయు నర్థరీతిఁ గ్రొత్త
పుష్టి రసమున శ్లేష నక్లిష్టతయును
వికటబంధత్వ మనునిట్టివివిధగుణము
లొక్కచోటన గనుపట్టు టక్కజంబు. 41

గీ. అఖిలవృత్తాంతగామిని యగుచు నెవని
కవిత భారతమట్లు లోకత్రయంబు
నాక్రమింపదొ యట్టివాచాటురచన
వలన ఫల మేమి? చపలతాప్రకటనంబె. 42

గీ. వీసమును ఖేద మొలుఁగ నుచ్ఛ్వాసవిరతి
వక్త్రముల నాట్యమొసరించు వాణి యెప్పుడు
అట్టియాఖ్యాయికాకవితోద్భవులు
వంద్యులేకద కవితాప్రపంచమందు. 43

ఉ. వాసవదత్తశక్తివిభవంబునఁ గర్ణగతంబుగాఁగఁ గుం
తీసుతులట్లు తెల్లకవిధీశులు దర్పముఁ గట్టిపెట్టి ర
వ్వాసవదత్తశక్తివిభవంబున హృద్గతమయ్యె నేని ని
శ్వాసమె రాదు ప్రౌఢపదబంధుర భారతి పైకివచ్చునే.

గీ. కృతమనోహారవర్ణసుస్థితిని గాంచి
చారుపదబంధదీప్తిచే హారియైన
భట్టహరిచంద్రకృతగద్యబంధ మిలను
రాజుకైవడి రంజించు రసికవరుల. 45

కం. అవినాశియు నగ్రామ్యము
సువిశుద్ధమునోజ్ఞజాతిశోభితముఁగా
సవరించె సూక్తిరత్న
ప్రవిమలకోశంబు సాతవాహనవిభుఁడున్. 46

గీ. సేతునిర్మాణమునఁ గపిసేన దాఁటె
నబ్ధి లంఘించెఁ బ్రవరసేనావనిపుని
కీర్తికుముదోజ్జ్వలాచ్ఛవిస్ఫూర్తితోడ
విబుధలోకస్తవంబులు విన్న ముట్ట. 47

గీ. సూత్రధారకృతారంభసుస్థిరములు
ఘనపతాకలు భూమికాకలితమూర్తు
లగుచు దేవకులంబుల ననుకరించు
నట్టినాటకముల భాసుఁ డందె యశము. 48

గీ. శ్రవణపేయవిపంచీస్వరంబుపగిదిఁ
గాళిదాసోక్తి నిజకర్ణగతముగాఁగ
మధురసార్ద్రంబు లగుసుమమంజరులను
బోలెఁ బ్రీతి జనింపనిపురుషుఁ డెవఁడు ? 49

. గిరిజాప్రీతికరంబులు
సరసము లుద్దీప్తమదనసామ్రాజ్యము లా
హారలీలలట్లు రసికులఁ
గరఁగించు బృహత్కథాఢ్యకల్పన లెలమిన్. 50

గీ. ఆఢ్యరాజకృతోత్సాహ మాత్మలోన
భావన మొనర్ప జిహ్వికాపల్లవంబు
పోవుచున్నది లోని కపూర్వబంధ
చాతురీరీతు లేగతి సంభవించు. 51

గీ. ఐన రాజేంద్రుఁ గూర్చినయధికభక్తి
యాత్మఁ బ్రేరేప నాఖ్యాయికాబ్ధిలోన
నిర్వహణభీతి వైదుష్యగర్వ ముడుప
జిహ్వికాప్లావచపలతఁ జేయుచుంటి. 52

గీ. సుఖవిబోధకలలితముల్ శుద్ధవర్ణ
ఘటితములు నయి పదబంధకల్పనములఁ
గమ్రశయ్యాలకరణి నాఖ్యాయికలును
సేవ్యములు గావె కావ్యార్థచింతకులకు ? 53

కం. జ్వలితప్రతాపశిఖిసం
కలితప్రాకారగుప్తఘనమండలుఁడై
బలికర్ణదధీచులతోఁ
దుల యగుహర్షుండు విశ్వధూర్వహుఁ డలరున్. 54

క. శ్రీభూనీళాసేవిత !
నాభీసరసీజసృష్టకనానాండశ్రేణీస్వం
జాభివ్యక్తగుణాత్మక !
మాభర్తా ! భక్తలోకమానసహర్తా !

వ. దేవా ! యవధరింపుము.

## కథా ప్రారంభము.

శా. శ్రీనారాయణనాభిపద్మమధుపశ్రేష్ఠుండు బ్రహ్మాండముల్
వాసంజాలుకులాలశిల్పి నిగమాఖ్యానైకనిష్ఠుండు శ
ర్వాణీనాథముఖామరేంద్రముకుటప్రాంచత్పదాబ్జుండు ని
త్యానందామృతవార్ధి,బ్రహ్మ యొకనాఁడాత్మీయలోకంబునన్

శా. భారద్వాజవసిష్ఠకాశ్యపముఖబ్రహ్మర్షి దేవర్షిసం
వారంబు ల్గొలువ న్విశుద్ధధవళాబ్జాతోరుపీఠంబుపై
నారోహించి ప్రజాపతు ల్మనులు బ్రహ్మజ్ఞానము ల్సల్పలో
కారాధ్యుండు తదేకసంశ్రవణనిష్ఠాసక్తుఁడై యుండఁగన్.

ఉ. కొందఱు ఋక్కులన్ మునులు
కొందఱు సామములన్ యజుస్సులన్
గొందఱు కల్పసూత్రములఁ
గొందఱు యజ్ఞవిధానవిద్యలన్

గొంద ఱశేషనైగమిక
గూఢమహార్థములన్ వచింప వా
రందఱిలోన నత్రిసుతుఁ
డాగ్రహరూపుఁడు మందపాలుతోన్. 3

చ. కలహముఁ బెంచి రోషరయగద్గదకంఠకఠోరనాద మా
ప్రళయమహోగ్రభైరవరవప్రతిమంబుగ సామగానముల్
సలుప నవస్వరంబు మునిసత్తములెల్ల వినంగఁ దోఁచినం
బలుకక యూరకుండిరి సభాసదు లందఱు శాపభీతులై. 4

చ. అపుడజురాణి వాణి కమలాసనుఁ జామర మెత్తివీఁచుచున్
చపలకటాక్షమాలికలు చారుసభాంతరసీమ నిండ న
త్తపసిని జూచి పాటలరదచ్ఛద మించుక విప్పి దిక్తట
ద్విపరదకాండపాండురవిదీప్తులు వెల్వలఁ బాఱ నవ్వినన్. 5

శా. భాషాదేవిశుచిస్మితంబుఁ గని దుర్వాసుండు దుర్వారవి
ద్వేషప్రస్ఫురదోష్ఠపల్లవుఁడు సందీప్తాగ్రనేత్రుండునై
యోషారత్నముపైని శాపజలముల్ ప్రోక్షింప నిల్వంగఁ ద
ద్రోషోదగ్రహుతాశనోష్మలన నూర్పుల్దోఁచె గాఢంబులై.

గీ. విప్రసంరంభమును జూచి వేదమాత
దేవి సావిత్రి దుర్వాసుఁ దేఱిచూచి
చెడుగ ! సామంబుఁ జెఱిచియు సిగ్గులేక
వాణి శపియింతురా ! యని పల్కుచుండ. 7

గీ. అత్రిముని, పుత్రి! యేల నీయలఘుతపము
కోపమున నాశమొనరింతు కుమతి వగుచు
సకలలోకైకజనని భాషావధూటి
తండ్రి! తిట్టకు మనుచు నదల్చుచుండ. 8

గీ. అకట! వాగ్దేవి శాపార్హ యగునటయ్య
తప్పుఁ గావు మటంచు బృందారకులును
గోప ముపసంహరింపుఁడు గురువు లనుచు
వటువులును గూడి వేఁడ నబ్బఁడుఁగుఁడపసి. 9

ఉ. అసరసీజయోని మగఁడన్న మదంబున నిందుశొల్వ్యలో
భూసురులెల్లఁజూడ ననుఁ బూరికిఁగైకొన కిట్లునవ్వి తీ
వోసిదురాత్మురాల!మనుజోర్వివసింపుముపొమ్మటంచుఁ దా
నీసునఁ దిట్టె లోకజనయిత్రిని బద్మభవుండు బెగ్గలక. 10

గీ. వేదజనయిత్రి సావిత్రి విప్రసకును
మరలఁ బ్రతిశాప మీయఁ గమండలఁబు
పాణిపుటమున ధరియింపఁ బరమసాధ్వి
పద్మజానిరాణి వారించి పలికె నిట్లు. 11

చ. చెలియరో!తాపసోత్తములుచిత్తమునందొకతెంపుసేసితా
మలిఁగిన నల్గనిమ్ము సకలాగమతత్త్వరహస్యమాత నీ
వలిఁగిన లోకముల్నిలుచునమ్మ ద్విజన్ములుజాతిమాత్రమా
న్యులుగద శాంతిఁబొందుముమహోదధి వేలనతిక్రమించునే

వ. ఇట్లు సముచితభాషణంబుల భాషాయోష కుపితయగు
సావిత్రి ననునయించుచున్నసమయంబున 13

సీ. శాపావసానసంజాతసభాక్షోభ
మబ్జాసనుండు హస్తాంచలమున
వారించి మధురగంభీరస్వరంబునఁ
బ్రావృడంభోధరధ్వానగరిమ
నాత్రేయుతోఁ బల్కె నరుణాధరము విప్పి
దంతకాంతుల దిశల్ ధవళములుగ
విషవృక్షమునకును విప్ర! నీకు సమంబు
పటుజటావల్కలభార మంతె

గీ. శాంతి లేనితపం బేల శాస్త్ర మేల
స్థలజలాంతరభూతవిదాహమునకు
వత్స! పుట్టితి వత్రిగర్భమున నీవు
కలశవారాశి జనియించె హాలహలంబు.

గీ. కోపమును నిగ్రహింపనికుత్సితాత్మఁ
డైహికాముష్మికసుఖంబు లందఁగలఁడె ?
అక్షియుగళంబు గల్గినయంధుఁ డతఁడె
సాధుగర్హితశీల ! యీచల మదేల ? 15

గీ. క్రోధధర్మంబులకు సమానాధికరణ
మగ్నికి జలంబునకుఁ బోలె నవనిఁ గలదె ?

కోపమును నిగ్రహింపక కుమతి వగుచు
బాల వాగ్దేవి శపియింపఁ బాడియగునె! 16

వ. అని భాషాదోషం జూచి కమలాసనుండు 17

ఉ. బాల! కలంతఁ జెందకుము బ్రాహ్మణశాప మవశ్యభోగ్యమౌఁ
గాలనియోగ మెవ్వరును గాదనఁజాలరు ధీర వీవు నీ
లాలక! మద్వియోగబహుళార్తిఁ గృశింపకు మర్త్యలోకమ
దీలలితాంగి వేదజనయిత్రి భవత్సఖి తోడు నీ కగుఁ. 18

క. మనుజభువి సుతునిముఖమును
గనుటయె శాపాంత మట్లుగావున మరలన్
ననుఁ గొల్వ నేగుదెంతువు
చనుమా సావిత్రిఁగూడి సారసనేత్రా! 19

వ. అని భారతి నూఱడించి విసర్జితసురాసురమునిమనుజమండ
లుండును ససంభ్రమోపగతనారదస్కంధవిన్యస్తహస్తుం
డునై చతుర్ముఖుండు సముచితాహ్నికకరణార్థం బరిగె
నంతఁ గమలజురాణి శప్తయయి 20

గీ. మోముఁదమ్మిని గన్నీరు ముమ్మరముగఁ
దనకుఁ బ్రామిన్కులమ్మౌక్తికదండ యొసఁగ
వేఁడియూరుపుసెగలఁ గెంజెదవి గందఁ
బలుకుఁదొయ్యలి యిలుసేరె వగలఁ బొగిలి.

చ. మునివచనంబుచే నజునిముద్దియ యుర్వికి డిగ్గువార్త భూ
జనులకుఁ దెల్పవచ్చెననఁ జండమయూఖుఁడు దోఁచెఁదూర్పున
న్మునిఁగె నపారపశ్చిమసముద్రమునందు సుధాంశుఁడుగ్రభా
నునికరకాండఘట్టనఁ దనుద్యుతి సర్వము మాసిపోవఁగన్.

ఉ. అంతట నంశుమంతుఁ డుదయాచలకూటము లాక్రమించి దు
ర్దాంతమయూఖమండలవితానని తాంతహలు తాశనచ్ఛటా
క్రాంతదిగంతుఁడై గగనగహ్వర మంతయు నాక్రమించియం
తంతఁగ్రమంబున న్బరిణతారుణకాంతుల నొప్పె శాంతుఁడై.

మ. సమదైరావణదంతకుంతదళితస్వర్వాహినీకూల ము
త్తమసత్పర్షి సమర్పితార్ఘ్యజలసంత్రస్తోగ్రమందేహ మ
స్తమితాదిత్యమయూఖతాపము గిరీశవ్రిస్ఫురత్తాండన
స్తిమితంబయ్యెఁ బ్రదోష మంబరచరశ్రీమంతిసీతోపిమై.

ఉ. అంతటఁ బండువెన్నెల లజాండకటాహము నిండ యామినీ
కాంతమొగంబునం బొలుచుకప్పురపుందెలిచుక్కనా నిశా
కాంతుఁడు వచ్చెఁ గల్వలవికాసము హెచ్చె మొగిడ్చెఁ బద్మినీ
కాంతమొగంబుఁ జంద్రశిల కాయము నిండఁ జెమర్చెనత్తఱిన్.

వ. అట్టి రమణీయయామినీప్రథమయామంబున విరించివిరహ
దోదూయమానమానసయు శూన్యహృదయయు నయి
కన్నుఁగవం దొరఁగుబాష్పకణంబులు నఖాంకురంబుల

మీటుచు బయలు సూచుచున్నయమ్మహాదేవిం జూచి
సావిత్రి యిట్లనియె. 26

ఉ. బాల ! త్రిలోకపూజ్యుఁ డగుపంకజగర్భునియంతవానియి
ల్లాలవు నీకుఁ దెల్పఁగ వలంతులమే వచియింపఁబూనినన్
నాలుకయాడ దత్రిమునినందనుఁ డాడినమాట శల్యమై
కాలుచుచున్న దెట్లయినఁ గాలగతిం దొలఁగింప శక్యమే.

గీ. తల్లి! త్రైలోక్యమంగళదర్పణంబు
కమలకోమల మగునీదుకమ్రముఖము
కజ్జలాశ్రుజలంబులఁ గందిపోయె
బాల ! చాలింపు మేల యీలీల జాలి. 28

గీ. అభిజనత్యాగ మేవారి కనభిమతము
నైజ మగుప్రేమబంధముల్ నఱుకరావు
నలువయెడఁబాటు మనసులోఁ దలఁపరాదు
ధీరచిత్తవు నిను నీవె దేర్చికొనుము. 29

సీ. హిమవాలుకాపూర్ణరమణీయతరభవ్య
భాగీరథీనదీప్రాంతవనమొ
రాధామనోనాథగాథాశతపవిత్ర
సాధుబృందావనీసైకతములొ
రామచాపవిముక్తభీమసాయకభిన్న
సప్తసాలసమీపశైలతతులొ

భార్గవోగ్రకుఠారనిర్గతపాణిరా
జన్యరక్తౌఘనిర్ఝరతటంబొ
గీ. యక్షకిన్నరగంధర్వయాతుధాన
గానఘూర్ణితహిమశైలకందరములొ
చారుహాసిని! భవదీయచరణచార
యోగ్యములు పృథ్వి నింకెవ్వియో వచింపు. 30

వ. అనిన వాణి యిట్లనియె. 31

గీ. ఆర్య! భవదీయసాహచర్యమున నవని
శాపవిధి నెట్టులైనను సంతరింతు
లోకనాయకచరణాబ్జలోలుపంబుఁ
జిత్తమధుపంబు మరలింపఁ జేతఁగాదు. 32

చ. ధరణిఁ దపస్సమాధి కుచితస్థలముల్ నియమింప దేవి! నీ
వెఱుఁగుదు వట్లుగావునసఖీ! మనకేయ్యది వాసయోగ్యమో
యరసి వచింపుమా యని నిశాంతసమీరము సోఁకునంతకున్
సరసిజగర్భుని న్వీడువఁజాలక తాఁ గనుమూయకుండినన్. 33

వ. అపుడు పితామహవిమానహంసకులపాలకుం డీయపరవ
క్త్రము నుచ్చైస్స్వరంబునం బఠించిన. 34

గీ. "అనఘమానసలాలితహంసి నీవు
లోలలోచనముల బయ లేల సూచె

దమ్మ వ్యాప్తిజలావగాహన మొనర్చి
యరుగుదువుగాక మరలఁ బద్మాలయంబు.* 35

వ. నిజకర్తవ్యతాసూచకం బగువాక్యంబు విని భారతీదేవి.

కం. మునివాక్యము మదిఁ దలఁపఁగ
ననువై యున్నయది నాకు నజ్ఞానునిఁ గ
న్నియెద శాపాంతమ్మనఁ
జనియెద భూలోకమునకుఁ జయ్యన ననుచున్. 37

వ. సావిత్రిసహితయై పరమేష్ఠిపాలికిం జని ముమ్మారు బ్రహ్మ
దేవునకుం బ్రదక్షిణంబు సేసి యనుజ్ఞాతయై వేదమాత
కై దండయొసఁగ మర్త్యలోకమార్గంబు ననుసరించి చని
చని ముందట. 38

సీ. జలకేలిరసలోల జంభారికుంభీంద్ర
కరఘాతసంచలద్గ్రాహకులము
శమనసైరిభశృంగసంభిన్నవల్మీక
బిలనిర్గతాభీలవిషధరంబు
చతురాననవిమానచక్రాంగకులగరు
న్మరుదంకురవిధూతమధులిహంబు
హరవృషోగ్రవిషాణఖరఖురోత్పాటిత
పర్యంతపర్వతప్రస్తరంబు

గీ. సప్తఋషికృతమృల్లింగసైకతంబు
అబ్జసంభవనిర్వర్తితాహ్నికంబు
సకలలోకైకపావనస్వాదుసలిల
మభ్రగంగామహాప్రవాహంబుఁ గనియె. 39

గీ. అమ్మహావాహినీతీర మనుసరించి
కల్పలతికాకుడుంగముల్ గడచి కడచి
మేఘమాలిక లొాగిఁ జీల్చి మెఱుపువోలె
దిగియె సావిత్రితోడ వాగ్దేవి యిలకు. 40

గీ. వరుణదేవునిముత్యాలసర మనంగ
నబ్జసంభవునకు నపత్యం బనంగఁ
బ్రణుతికెక్కిననదమాటఁ బద్మభవుని
యింతిమానసమును హరియించె నదియు. 41

సీ. ఆకాశముననుండి యాదేవి దిగునప్పు
డవనికి నవరత్నహార మనఁగఁ
జంద్రాచలమునుండి స్రవియించి ధరణికి
నవతరించినయమృతాంబు వనఁగ
వింధ్యపర్వతకూటవిధుశిలాద్రవములు
పండువెన్నెలరేలఁ బాఱె ననఁగ
దండకారణ్యకర్పూరకదళికా
ద్రుమము లీనినప్రవాహము లనంగ

గీ. దెసలఁ బుట్టినలావణ్యరస మనంగ
సంబరశ్రీవిలాసపర్యంక మనఁగ
నిర్మలాంబుపరిపూర్ణమై నేత్రపర్వ
మయ్యె వసుధ హిరణ్యవాహస్రవంతి. 42

ఉ. భూతలమందు శోణమని పూర్వమునుండియు వాసిఁగన్నవి
ఖ్యాతమహానదం బదియ కావునఁ దత్తటజాతమాలతీ
శీతలగంధవాహము లశేషపథిశ్రమమున్ హరింప వా
జ్మాత వసించెఁ దన్నికటమాధవికాలతికాలయంబునన్.

గీ. పావనస్వాదుసలిలప్రవాహమందు
వాణి సావిత్రితోఁ బ్రతివాసరంబుఁ
ద్రిషవణస్నాన మొనరించి త్రిపురహరునిఁ
బద్మదళములఁ బూజించుఁ బరమభక్తి. 44

ఆ. తాము గోయకుండఁ దమచేతఁ జిక్కిన
వన్యమూలమధురఫలరసములఁ
దనువు లోమి రపుడు జనని సావిత్రియు
భారతీవధూటి పరమమైత్రి. 45

గీ. వాసరము లేగెఁ బక్షముల్ వరుసఁ బోయె
మాసములు మాసె ఋతువులు మాయమయ్యెఁ
గడచె వర్షంబు లీరీతిఁ గాలచక్ర
మనిలజవమున విశ్రాంతి యవక తిరిగె. 46

వ. అంత నొక్కనాఁటియుదయావసరంబున. 47

కం. పటుతరహయఖురనిస్వన
ఘటితద్విగుణితసమగ్రకర్కశహేషో
ద్భటనాదప్రతిశబ్దము
లటవీగిరితటులు కంపమందఁ జెలంగెన్. 48

కం. ఆకాననమున నెన్నం
డేకాలమునందు విననియీనాదము భా
షాకాంతమానసాబ్జము
నాకర్షించుటయుఁ గౌతుకాక్రాంతమతిన్. 49

ఉ. అంతలఁ దాలయంబువెలి కాయమ వచ్చినఁ గాననయ్యె దు
ర్దాంతతురంగశాతఖురదారుణపాతలుఠత్పరాగ మా
శాంతరపూరితం బగుచు నంత నిరంతరఫేనపుంజసం
క్రాంతముఖంబులై వలితకంధరము ల్పరతెంచె నశ్వముల్.

ఉ. ఆశ్వికబృందమధ్యమునయందు ననంగునిఁబోలువాఁడు స
ప్తాశ్వసమప్రతాపుఁడు మహాభుజుఁ డూర్జితతేజుఁ డొక్కఁ డీ
విశ్వము నేలఁజాలుభుజవీర్యసమన్వితుఁ డబ్ధివేష్టితో
ర్వీశ్వరుఁ డించుమించుపదునెన్మిదియేడులవాఁడు గన్పడెన్.

▪ తొలకరినల్లమబ్బులకుఁ దుమ్మెదఱెక్కల తేటనిగ్గుకుం
దుల యగుమేనిచాయ గలతోరపుగుఱ్ఱము నెక్కి రావుతుల్

పలువురు కుంతపాణులయి పార్శ్వములం గొలువంగ మౌళి పైఁ
దెలిగొడుగొప్పువాని నతిధీరుని వాణి యధీరయై కనెన్. 53

ఉ. ఆతని పజ్జ నున్నతహయంబు పయిన్ సితవారవాణసం
స్ఫీతతనుండు శేషనిభపీవరబాహుఁడు బాహుజాన్వయ
ఖ్యాతచరిత్రుఁ డుగ్రసమరాంతరశాంతనవుండు శుద్ధబా
లాతపవర్ణుఁ డొక్కపురుషాగ్రణి యేగుచునుండెఁ జెచ్చెరన్.

గీ. ఆతఁ డేఁబది యేండ్ల ప్రాయమున నుండి
రణములం దాటి తేఱిన రాజపుత్రి
వీరుఁ డగుట నృపాత్మజు వెంట నంటి
యంగరక్షకుఁడై వచ్చునట్లు తోఁచె. 54

వ. అంత నష్టాదశవర్షదేశీయుం డగు నయ్యువకుండు పార్శ్వ
చరులతోడం బరిహాసవచనంబు లాడుచు దరస్మితాననుం
డయి యేగువాఁడు 55

చ. అతఁడు పురఃప్రధావితపదాతిసమూహము దెల్ప భారతీ
సతియసమానరూపరుచిసంపదసొంపు తెఱం గెఱింగి వి
స్మితుఁడయి దర్శనోత్సుకతచిత్తుఁడునుం బొడమంగ నాశ్విక
ప్రతతిని డించి తద్విపినపాదపపద్ధతిఁ బాదచారియై. 56

వ. అంగరక్షకుండు కైదండ యొసఁగుచుండ నక్కన్యకాయు
గళంబు సవినయంబున సందర్శించి వార లొసంగిన వన
వాసోచితాతిథ్యసత్కారంబుల సంప్రీతి నొంది సుఖోప

విష్టుఁడయి యున్నంత సావిత్రి ప్రివయసుం డగుద్వితీయ
పురుషు నుపలక్షించి సప్రిగల్భంబును సవినయంబునుంగా
నిట్లనియె. 57

గీ. సహజశాలీనతాగుణ స్త్రైణమునకు
సాహసంబట ప్రిథమభాషణము దలఁప
వనమృగీముగ్ధ లగుకులాంగనలమాట
వేఱ వచియింపవలయునే విబుధవర్య ! 58

గీ. అప్రిగల్భులనైన మహానుభావు
లాదరంబునఁ గనిరేని యపుడ వారు
మధువు ద్రావినకైవడి మనుజనాథ !
యధికవాచాటు లగు టొకయబ్బురంబె ! 59

గీ. అనఘా ! మీదర్శనమునఁ
గను లుండినఫలము నేఁడు గంటిమి విన్గాఁ
జనునేని మీయుదంతం
బనుపమగుణధుర్య ! తెలుపుమా చెవు లలరన్. 60

ఆర్య ! సాధువులం దప్రియత్నముగనె
గలుగు విస్రింభ మెట్టివారలకునైనఁ
గాన భవదాగమనశోకకారణమున
శూన్య మగుదేశ మెయ్యది శుద్ధచరిత ! 61

గీ. కమలసంభవునిర్మాణకౌశలంపుఁ
బరమకాష్ఠయ యైనయీభద్రమూర్తి
విస్మయావహ మగు టొక్కవింత గాదు
ధరణిలో నెట్టిధీరచిత్తములకైన. 62

సీ. గరళకంధరరోషకళినోగ్రహుంకార
గర్వనిర్వాపణాఖర్వశౌర్యుఁ
డసమానలావణ్యలసమానవిగ్రహ
ప్రసవాస్త్రుఁ డీతఁ డేవసుమతీశు
బహుజన్మకృతపుణ్యపరిపాకఫలరూపుఁ ?
డీకుమారకుఁ గన్నలోకపూజ్య
యేనాతిమిన్న ? దేవానాంప్రియుని వీని
యభిధానపుణ్యవర్ణాళు లెవ్వి ?

గీ. యార్యులయుదంత మీరీతి నరయువేడ్క
గలదు వచియింప మీ కనుగ్రహమ యేని
యేము సేసినతపము వర్ణింపఁదరమె
క్షత్త్రియాన్వయవార్ధిరాకాశశాంక ! 63

వ. అని సావిత్రి తదీయోదంతశ్రవణకుతూహలయై యడుగు
వచనంబు లాదరించి యారాజపురుషుండు వినయంబున
నిట్లనియె. 64

గీ. పరమసాదువులకుఁ బ్రియవాదసరణి
తరణి! కులవిద్య యగుట తథ్యంబకాదె!
మీ ముఖాంభోజములె కాదు మెలఁతలార!
చిత్తములుగూడ హిమధామశీతలములె. 65

సీ. జంభారిభుజశిలా స్తంభసం స్తంభన
ప్రౌఢ మెవ్వనితపఃప్రాభవంబు
అలఘుపులోమదైత్యారణ్యశిఖిశిఖా
కల్ప మెవ్వనిరోషకలుషదృష్టి
సకలసురాధిరాణ్మకుటరత్నచ్ఛటా
భాసురం బెవ్వానిపదయుగంబు
చతురంతవసుమతీశకుమారిక శర్యాతి
తనయ నెవ్వానికి ధారవోసె
గీ. విమలసోమరసాస్వాదవిధురకంఠ
సురభిషగ్యుగ్మకంబు నేశుద్ధమార్తి
పంక్తిపావనులను జేసి ప్రియ మందె
నతఁడు సామాన్యుఁడే చ్యవనాఖ్యమౌని. 66

వ. ఈసుకుమారమూర్తి కమలేక్షణ! యాబుషిచంద్రుఁడు స్వక
న్యాసుదతీవతంసము నహర్నిశ మంచితభక్తిఁ బావకో
పాసనఁ జేసి కాంచినయపత్యము పుట్టిననాఁటనుండియున్
భాసవ తేజుఁ డాధరణిపాలుఁడె మన్ననఁ బెంచెఁ బ్రేముడిన్.

ఉ. నైజననంబునన్ దుహితృవత్సలుఁ డాధరణీధవుండు వి
భ్రాజితశాతకుంభమణిపంక్తులు కానుక లిచ్చి యల్లునిన్
బూజితుఁ జేసి యాత్మజను బుట్టినయింటికిఁ గొంచుఁబోయె నీ
రాజతనూజుఁ డంత నుడురాజముఖీ! జనియించె నచ్చటన్.

గీ. దేవి! యీతని కపుడు దధీచి యనుచు
నామకరణంబుఁ జేసె మాతామహుండు;
ఎత్తికొని పెంచె నితని రాజేంద్రపత్ని
కాలిమంజీర మింతైనఁ గదలకుండ. 69

గీ. బాలకున కన్నివిద్యలు ప్రౌఢమతులఁ
బండితులఁ గూర్చి చెప్పించి పార్థివేంద్రుఁ
డింతవానిని జేసి మునీంద్రుకడకుఁ
బంపుచున్నాఁడు దేవి! యీబంటు నిచ్చి. 70

గీ. ఆమహారాజునాజ్ఞల ననుదినంబు
మౌళి ధరియించుసేవకపాళిలోన
భృత్యపరమాణు వొక్కఁ డీవృద్ధజనుఁడు
కూర్మి ననుఁ బిల్చు జేఁడు వికుక్షి యనుచు. 71

గీ. భృత్యవర్గంబునకు మహీవిభునికొలువు
తండ్రితాతలనాఁటినిధాన మమ్మ!
ధరణి వంశక్రమాగతదాస్యవృత్తి
ప్రభువులకటాక్షమునకుఁ బాత్రింబ కాదె. 72

శా. పాశేశోణముమాని క్షత్రరథకల్పం బాశ్రమం బీలతా
వారం బచ్చటి కొక్కకోశ్రమగు నశ్వవ్రాతముల్ గొల్వ నీ
వీరాంకూరము తాతపాదులను సేవింపంగ నేఁ డేగెడుక
నారీరత్నములార! మార్గమున సందర్శింపనయ్యె న్నిముక.

చ. తెలిపితి నింతనిక్కము సతీమణి! మాచరితంబు దేవతా
కులముల నుద్భవింపఁగలకోమలు లమ్మరొ మీరు భూమిపైఁ
గలుగుట కేమికారణమొ గాఢఘనాఘనగర్భనిర్గత
జ్వలితతటిల్లతల్ ధరణిభాగమునన్ జనియింప నేర్చునే. 74

గీ. దేవి! మీకులగోత్రముల్ దెలియు వేడ్క
కలదు హృదయంబు నిండ నిక్కంబునుమ్మ
అడుగఁ దగునేని వచియింప నవధియేని
ప్రథమప్రణయాభిలాష దీర్పంగఁ దగును. 75

ఉ. నీలవలాహకంబుల వినిశ్చలలీల వెలుంగఁజేయుశం
పాలతవోలె సాంద్రవనపంక్తుల సంతమసంబు వాపుచున్
బాలకదంబశాఖ కరపల్లవ మూఁతగ నిల్చియున్నయ
బ్బాల త్రిలోకపూజ్యయగు భారతియో రతియో భవానియో!

5. బాలాంధకారంబు భాస్వత్స్వరూపంబు
హారిమై యొప్పె నీయతివయందుఁ
బుండరీకముఖంబు పొలుపారుహరిణాక్షు
లింపులై పొలిచె నీయింతియందుఁ

దరుణాతపపరిభాధరమును గుముదహా
సముఁ జూడ నొప్పె నీనకియయందుఁ
గలహంసరవమును గమ్రపయోధరో
న్నతియుఁ గన్పట్టె నీనారియందుఁ
గరభోరుయుగ్మంబు గజరాజగమనంబు
సుందరమయ్యె నీసుదతియందు
సుకుమారభావంబు సుస్నిగ్ధతారక
త్వము పెంపుఁగాంచె నీతన్వియందు
గీ. కమలకోమలహస్తముల్ కఠినశైల
పృథునితంబము నొప్పె నీవెలఁదియందు
ధరణిలోనివిరుద్ధపదార్థములకు
నబల నేకాశ్రయంబుగా నజుఁ డొనర్చె. 77

చ. అనుటయులేఁతనవ్వు వదనాబ్జమునం దొకసొంపునింపఁబ్రా
మినుకులతల్లి రావుతుల మేటిని గాంచి నృపాలచంద్ర! యీ
వనమునఁ బెద్దకాలము తపంబొనరింపవలెన్ సమీపమం
దునికి యెఱుంగకుండుదురే యున్నవిధం బెఱిఁగింపకుండు మే.

గీ. మాయుదంతము సకలంబు మాన్యచరిత!
యచిరకాలంబులోఁ దెలియంగఁగలదు;
కాని యీనాఁటిమీయనుగ్రహము యెపుడు
సుస్థిరంబుగ మాపైని జూపవలయు. 79

చ. అపుడు దధీచి వార్షికమహాబ్దరవప్రతిమస్వరంబునన్
విపినశిఖండితండములు వేడుకఁ దాండవమాడ నాశ్వికా
ధిపుఁగని పల్కె నార్య! సుదతీమణిమాట సమంజసంబు నేఁ
డుపవనసీమ కేగి జనకోత్తములం గని వత్త మింకిటన్.

గీ. అని వచించి వికుక్షితో నపుడ కదలి
రాజదౌహిత్రుఁ డాశ్వికరాజి గొలువ
భావమున వాణిరూపంబు పాదుకొలిపి
యరిగె మెల్లన తాతపాదాశ్రమంబు. 8

శా. ఆవాసీంద్రకుమారుఁ డేగినఁ దదీయాకారవిద్యాగుణ
వ్యామోహాకులచిత్తయై స్మరధనుర్జ్యాముక్తచూతాంబక
స్తోమంబోర్వక యాశ్వికుల్సనినయాత్రోవ న్విలోకించుచున్
భామారత్నము వాణి దృష్టి మరలింపన్ లేక రాగాంధయై.

సీ. పలుమాఱు వానిరూపంబు మానసవీథి
లిఖియించు భావతూలిక నమర్చి
లిఖియించి యాతని లీలావిలాసంబుఁ
గని మెచ్చుఁ బరమేష్ఠికౌశలంబు
మెచ్చి యాసుకుమారుపచ్చనిమేనికిఁ
గనుఁబాటు వొరయునో యని తలంకుఁ
దలఁకి యాతనిఁగూడి కల్లైన రమియింపఁ
గలుగునా యని కన్నుఁగవను మోడ్చు

గీ. మోడ్పిన దృచి యేతెంచి మోప్రిల నన్న
పగిదిఁ దోఁచిన భుజలతాయుగము సాఁచిఁ
వట్టిబయలును గౌఁగిటఁ బట్టి తెలిసి
యొరులు గాంచిరో యనుచుఁ దా నలికిపడును.

ఉ. అంతఁ ద్రియామయంబగు సహస్రకు తేజము శాంతిఁ బొందఁగా
సంతమసంబు లెల్లను దిశావలయంబున నాక్రమించె ది
క్కాంతలనూపురధ్వనులకై పరువెత్తువియద్ధునీసరో
జాంతరరాజహంసియన నాహరిణాంకుఁడు దోఁచెఁ దూర్పునన్.

గీ. తరిపి వెన్నెల రేల నెత్తమ్మి రేకుఁ
జివురు సెజ్జలపై మేను సేర్చుఁ గాని
కాఱుచిచ్చులఁ బొరలాడు కరణి నున్న
కన్నుఁగవ మూసి మెఱుఁగ దాకలువకంటి. 85

వ. వెండియు వియోగదుస్సహం బగు దీర్ఘయామినీసమయం
బుల నిట్లని వితర్కించు. 86

సీ. ఆమనోహరమూర్తియాననలావణ్య
పీయూషనిష్యందబిందుపంక్తిఁ
డానరగాఁ బ్రాణియక్షివిక్షేపముల్
వికసితోత్పలవనీవిలసనములు
ఆమోహనాంగునియధరమణిద్యుతుల్
బంధూకవనరాజిబాంధవంబు

లారాజసింహాస్వయంగవిస్ఫూర్తికిఁ
బరభాగసామగ్రిభావజుండు

గీ. ధన్య మగుఁగాదె వీనిసందర్శనమున
భామినీలోకయౌవనప్రాభవంబు
రాజదౌహిత్రిసాహచర్యంబుఁ గన్న
రాజబింబాస్య లోకైకరాజ్ఞి గాదె. 87

వ. ఇట్లు నిరంతరనిపతితపంచశరశరవేదనాభరంబు సైరింపం జాలక యున్నవాణి కంతకంతకు సంతాపం బగ్గలం బగుటయు. 88

సీ. మందమారుతధూతమల్లీపరాగంబు
సోరకుండఁ గన్నీరు దొరుగుచుండు
లవలీలతాతతుల్ లవము సోఁకకమున్న
నెమ్మేన వేదనల్ నివ్వటిల్లు
శ్వేతగరుద్గరుద్ధూతశీకరవారి
సుడియకుండనె మేను దడిసిపోవుఁ
గాదంబరథముపైఁ గాలు వెట్టకమున్న
సరసీజలంబులఁ దిరిగిపోవు

గీ. చక్రమిథునవియోగనిశ్వాసధూమ
కలుషితముగాక కాయంబు కములిపోవుఁ

పద్మరేణువిహాపితభ్రమరపంక్తి
గజ్జెకుండనె తనపురిఁ గంప మొదవు. 89

మత్త. భారతీసతి యీవిధంబున భావజాగ్రశరార్చులన్
ఘోరబాధలఁ బొందుచుండ వికుత్సి యౌవనభూమికిన్
వారిఁ జూడఁగఁగోరి దూరనివారితాశ్వికవారుఁడై
కూరిమిన్ జనుదెంచె భారతి కోరికల్ దలమూపఁగన్. 90

మాలిని. ఆతపవారణధారునితో నతఁ డాశ్రమభూమిని జొచ్చియు
శీతలసైకతవేది వసింపఁగఁ జిత్తము రంజిల నాతనికిన్ [టన్
శీతమయూఖముఖుల్ దగుపూజలు సేసి దధీచికి సేమమె నా
నాతఁ డకృత్రిమవాగ్జననిం గని యాదర మొప్పఁగ నిట్లనియెన్

ఉ. ఆనరనాథనందనున కన్నిట సేమమె కాని రాజబిం
బానన! యల్లనాఁడు భవదాశ్రమవాటముఁ జొచ్చుటాదిగా
మానె వనీవిహారములు మంజులకోకిలకాకలీకుహూ
ధ్వానము కర్ణశూలమయి తాపము సేయునొ యంచు భీతుఁడై

ఉ. మేను కృశించె భోజనము మీఁదఁ బరాకు జనించె నిద్రకున్
దాను విరోధియయ్యె సుమతల్పము లమ్ములశయ్యలయ్యెఁ జం
ద్రానన! కౌముదీసమదయంబు హుతాశనకీల యయ్యె మం
దానిలము ల్భుజంగదశనాంకురతీక్ష్ణము లయ్యె వానికిన్.

గీ. ఆమహీనాథునానతి నరుగువాఁడ
దాస్యవృత్తికి మాంద్యంబు ధర్మమగునె

సకలమును మాలతీదూతి చక్కఁబెట్టు
రాజపుత్రిన కది బహిఃప్రాణ మమ్మ ! 94

వ. అని వారలచేత ననిపించుకొని యాశ్వికసహితుం డయి యథేచ్ఛంజనియె నంత మఱునాఁడరుణోదయంబునఁ గతిపయపరివారసమేతయై మాలతి వారిపాలికిం జనుదెంచి సత్కృతయయి యేకాంతంబున, దధీచివృత్తాంతసమాకర్ణనకుతూహలాయత్తచిత్తయై యున్నవాగ్దేవితో నిట్లనియె.

సీ. విషయమాధుర్యంబు వెలఁది ! తెల్లమకాదె
యింద్రియచాపల్య మెఱుకపడదె
నవయౌవనోన్మాద మవధరింపవె దేవి !
చిత్తచాంచల్యంబు గొత్త యగునె
మన్మథహతకునిమాహాత్మ్య మెఱుఁగవే
దక్షిణానిలుమాటఁ దలఁపవలెనె
విరహతాపభరంబు వింతయె కల్యాణి !
యావసంతునిరంతు లడుగవలెనె

గీ. కాన నాపైని నిందలఁ గట్టవలదు
చపలతయు బాలిశతయును జారణతయు
నాదువాచాలతకుఁ గారణంబు గాదు ;
ఏమిసేయింప దూర్జితస్వామిభక్తి ? 96

ఉ. ఆమునినాథనందనుని కమ్మ! నిజం గనుటాదిగాఁగ నా
కాముఁడె యొజ్జ జీవితము కైరవనాథునితో మ్మ దేవి! నే
నేమని చెప్పుదాన భవదీక్షణలేశము ప్రాపు గల్గినన్
స్వామి చిరాయువౌను ముని చంద్రుని సంతతి శాశ్వతంబవున్.

సీ. అనుహూపుఁడౌ వరుం డతఁ డని వచియింప
నాత్మసంభావనం బదియు కాదె
శీలవంతుఁ డటంచుఁ జెప్ప నొప్పునుగాని
యది ప్రక్రమవిరుద్ధ మగుట నిజము
సుభగుఁ డాతండని సూచింతు నంటినా
యీమాట నీనోట నసఁగవలయు
ధీరచిత్తుఁ డటంచుఁ దెల్పఁగూడును గాని
ప్రస్తుతస్థితి కది పడనిమాట

గీ. దాస్యమును గోరె ననుట ధూర్తప్రలాప
మార్య! రక్షింపు మనుట కాతర్య మగును
గలల నినుఁ గాంచు ననుటకుఁ గలదె సాక్ష్య
మట్లుగాఁపునఁ బలుకంగ నలవిగాదు. 98

వ. అని వైదగ్ధ్యంబు మెఱయఁ బలికిన వాణి యిట్లనియె. 99

ఉ. మాలతి! చూడు మేను పలుమాటలదానను గాను ధారుణీ
పాలకులావతంసుపయి భావము చిక్కెను నీట ముంచినన్

బాలను ముంచిన స్సకలభారము నీయది యింక నేను నీ
పాలిటిదాన నంగభవుబారికి నగ్గముసేయ కమ్మరో! 100

సీ. అనటయు మాలతి యతిముదంబునఁ బొంగి
దేవి! నే నిటకు దధీచి నిపుడె
గొనివత్తు దీనికై కొంకకు మదిలోన
యిట్లు పల్కుటయెల్ల నిందువదన!
రాజేంద్రుపై ననుగ్రిహముఁ జూపుటగాదె
యని మొక్కి యాదేవియానఁ బూని
చనియె నంతట సరస్వతి నఖిస్నేహంబు
పేరేపఁ దెలిపె సావిత్రి కపుడ

గీ. ఆయుదంతము సాంత మత్యాదరమున
నంత నత్కంఠ మనమున నతిశయింప
దివసశేషము కల్పాతిదీర్ఘ మయ్యెఁ
బలుకుఁజెలి; క స్తగిరిఁ జేరె భాస్కరుండు. 101

వ. అంత సంధ్యాసమయం బగుటయు. 102

మ. అరుణాగభ స్తిబింబ మపరాంబుధిఁగుంకినయంతఁ బూర్వాది
గ్గికహారంబు వెల్వడి వికీర్ణసటాచ్ఛటమై తమోగజో
త్కరముఁగరంబులందునిమి తదుధిరాప్లుతిలోహితాంగమై
కరముహెలింగెఁ దూర్పుదెసఁ గైరవనాథమృగేంద్రముద్ధతిఁ.

ఉ. ఆరసికావతంసుదరహాసరుచుల్ దలపించు చంద్రికా
పూరములన్ నదీతటముపొంత సుశీతలసైకతస్థలిన్
జారుమృణాలసూత్రమయశాటి కటి న్ధరియించియున్న యా
భారతి భావజోగ్రపటుబాణపరంపర కోర్వ కాత్మలోఁ.

వ. ఇట్లని వితర్కించె. 105

ఉ. కారణకార్యవేళల జగంబులలో నడవన్ వెలార్పఁగా
భూరికృపామతి న్మనుపఁ బ్రోడ జనార్దనుఁ డంతవాని కే
నారయఁ గోడలైతిఁ గమలాసనుఁ బొందితి నట్టినేన యీ
మారునిచేతఁ జిక్కితిని మానుషభామలమాట యేమిఁకన్.

మ. అని చింతించుచు బాష్పముల్ దొరుగ న
య్యబ్జాక్షి రేయెండతాఁ
కున మధ్యందినచండభానుకిరణ
క్రూరప్రసారంబునన్
దన సౌభాగ్యము మాసియున్న లతచం
దం బొప్ప మూర్ఛాలసా
ననయై వ్రాలె దధీచిరూపమయ బా
ణధ్వస్తహృన్మర్మయై. 107

ఉ. అంతకుమున్న వాణిహృదయం బఖిలంబును దూతిదెల్పఁగా
సాంత మెఱింగి యానృపతిసత్తముఁ డంగజకేళికౌతుకా

కాంతమతిం దదీయలతికానిలయంబున నుంటఁజేసి యా
కాంతను గ్రుచ్చియెత్తెఁదనకౌఁగిటఁ గామశరార్తివాయఁగన్.

వ. ఇట్లు వియోగపయోధి మునుంగనున్నయమ్మహాదేవి న
దరించి దధీచి సముచితాలాపంబుల ననునయించె ననం
తరంబ. 109

గీ. మదనునిరయానతిఁ దల నిడి
ముదమున నవయౌవనంపుముచ్చట దీఱన్
హృదయములు మేను లొకటిగఁ
గదిసిరి మదవతియుఁ బతియుఁ గామునికేళిన్. 110

సీ. శోణాంబుశీకరస్తోమార్ద్రపవనాంకు
రాందోళితామ్రవణాంతరములఁ
గిన్నరీబృందసంగీతఘూర్ణితదరీ
కుహరమండితశైలకూటతటులఁ
గహ్లారకాదంబకమనీయదీర్ఘికా
తటవినిర్మితమణీధామములను
సాంద్రశరచ్చంద్రచంద్రికాపూరసం
ప్లావితామరఝరీవరిసరము ల
గీ. వాణియు దధీచియును గూడి వత్సరంబు
భూరిముదమునఁ గామోపభోగకలన

దివసమునుబోలెఁ గడపి రాదేవి కంత
గర్భలక్షణములు మేనఁ గానవయ్యె. 111

గీ. నెలలు తొమ్మిదియును నిండఁ బలుకుఁజెలువ
శుభముహూర్తంబునం దొక్కసుతుని గాంచె
నప్పు డాకాశవాణి యాయర్భకునకు
నందఱు వినంగ సారస్వతాఖ్య నొసఁగె. 112

క. జననీవరమహిమంబునఁ
గను దెఱవకమున్న సకలకలలును విద్యా
వినయాదిసుగుణసంపద
లనితరసులభములు వాని కన్నియుఁ గలిగెన్. 113

చ. తనయముఖావలోకనమె తాపసశాపవిరామమౌట వా
గ్జనని దధీచిహృత్కమలకందముతోడఁ ద్రియామతల్లితోఁ
జనియెఁ బితామహుం గొలువఁ జంద్రనిభాననఁ బాసియాతఁడు
న్వనమున కేగి యచ్చటఁ దపంబొనరింపఁ దలంచె శాంతుఁడై.

గీ. ఆకుమారుఁడు వనమున కరుగఁదలఁచి
భృగుకులోత్పన్నుఁ డగునొక్కవిప్రరమణి
కక్షమాలకు నిజసుతు నప్పగించి
యరిగె విరహార్తుఁడయి తపం బాచరింప. 115

గీ. పలుకుఁదొయ్యలి పుత్రునిఁ బడసినపుడె
యక్షమాలయుఁ బ్రసవించె నాత్మజన్ముఁ

గవలబిడ్డలపోల్కి నాకమల నేత్ర
పెంచె నిరువురఁ బాలిచ్చి ప్రేమతోడ. 116

వ. ఇట్లు బాలకు లిరువురు శుక్లపక్షపాకరునిలీల దినదిన ప్రవర్ధమాను లగుచున్నంత యౌవనారంభసమయంబున వాణీవరమహిమంబునం జేసి సారస్వతున కశేషవిద్యా వైదుష్యంబు గలిగె నతండును బ్రాణసమానుం డగు వత్సునకు సమస్తవాఙ్మయంబు నొసంగి కృతదారపరిగ్రహుం డగునిజసోదరునకుఁ బ్రీతికూటాగ్రహారంబు నివాసంబుగా నొసరించి జటావల్కలధారియై తపంబాచరింప నిజజనకునాశ్రమంబున కరిగె నంత నతండు మూలపురుషుండుగాఁ దద్వంశం బతనిపేరన లోకవిఖ్యాతంబై పరిఢవిల్లె. 117

శా. ఆవత్సాన్వయ మాదిపూరుషపదప్రారబ్ధమాహాత్మ్యమై
శ్రీవిభ్రాజితమై మహేశ్వరశిరశ్శైఫాలికామాల్యమై
యావిఖ్యాతమహోపసుప్రకరమై యాశాంతవిఖ్యాతమై
దేవవ్రాతము ప్రస్తుతింప వెలసెన్ దివ్యాపగాప్రక్రియన్.

ఉ. ఆమహనీయవంశమున నధ్వరనిర్మలకర్మమార్మికుల్
సోమకషాయితోదరులు శుద్ధమనస్కులు శాబ్దికుల్ కలా
ధాములు కావ్యనాటకకథారచనాత్యవధానధీయుతుల్
కామవికారదూరులు వికర్తనతేజులు పుట్టి రగ్రజుల్.

మ. తిరుగన్ సంసృతిచక్రమేఁగ యుగములీరంబులై వర్షముల్
సురిగెన్ వచ్చెఁ గలిప్రధానదినముల్ శుద్ధప్రజానంతతి౯
ధరణిన్ దామరతంపరై వెలుఁగుతద్వాత్సాన్వయాబ్ధిన్ సుధా
కరుఁడై పుట్టెఁ గుబేరుఁడన్ ద్విజుఁడులోకఖ్యాతచారిత్రుఁడై.

సీ. ఆతని కీశానుఁ డచ్యుతుండు హరుండు
పాశుపతుం డనఁ బ్రబలమతులు.
వేదవేదాంగాదివిద్యారహస్యసం
వేదులు నలువురు విప్రవరులు
దామోదరునిభుజాదండంబులును బోలె
సచ్చక్రనందకచారుమూర్తు
లుదయించి రందులో నుత్తమోత్తముఁడగు
పాశుపతున కర్థపతి యనంగఁ

గీ. బుట్టె నిగమాంతవిజ్ఞానపుణ్యమూర్తి
సకలభూదేవమండలచక్రవర్తి
శత్రుసమవర్తి విశ్రుతచారుకీర్తి
భారతీదేవియపరావతారమూర్తి. 121

వ. అతనికి భృగుండును హంసుండును శుచియును గవియును మహిదత్తుండును ధర్ముండును జాతవేదుండును జితభానుండును దృఢత్తుండును నహిదత్తుండును విశ్వరూపుండును ననువార తేకాదశరుద్రులంబోలి యుదయించి

రందులోన చిత్రభానునకు ధర్మపత్ని యగురాజదేవి
యందు. 122

ఉ. బాణుఁడు కామినీకుసుమబాణుఁడు సర్వవిపక్షలోకహృ
ద్బాణుఁడు దుష్కవిప్రకరవార్షికనీరదమాలికాజగత్
ప్రాణుఁ డనల్పకాల్పనికరమ్యకథారచనావధూతగీ
ర్వాణగురుండు పుట్టె నిజవంశసుధాంబుధిపూర్ణచంద్రుఁడై.

క. ప్రతికూలదైవవశమున
నతనికి జననీవియోగ మతిబాల్యదశా
పతితం బగుటయు జనకుం
డతులితవాత్సల్యమున నిజాత్మజుఁ బెంచెన్. 124

శా. శ్రౌతస్మార్తవిధిప్రదిష్టశుభసంస్కారాన్వితు న్వేదవి
ద్యాతత్త్వజ్ఞసుధీపదాబ్జపరిచర్యాసాదితామ్నాయునిన్
శీతాంశుప్రతిమల్లసౌమ్యవదనస్ఫీతున్ సుతుం జూచి సం
ప్రీతుండై జనకుండు గాంచెఁ దరుణీవిశ్లేషదుఃఖాంతమున్.

గీ. పదియునాల్గేండ్లు సుతునిపైఁ బడకమున్నె
చిత్రభానుండు దివికి నిశ్చింత నరిగెఁ
దండ్రి నెడఁబాసి శోకదందహ్యమాన
మానసుం డయి బాణుండు మందిరమున. 126

క. కష్టమునఁ గొన్నిదివసముల్ గడపె నంతఁ
గాలపురుషునిమాయావికారకలన

జనకవిశ్లేషదుఃఖంబు శాంతి నొందెఁ
గలిగె స్వాతంత్ర్య మవినయకారణంబు. 127

ఉ. శైశవ మంతరించి నెఱజవ్వన మేర్పడుసంధిలో హితా
దేశమొనర్చి పెంచునుపదేష్టలు లేమిని సంగడీండ్రతో
దేశములం జరించుచు సుధీజను లందఱు నవ్వఁగా గ్రహా
వేశము నొందినట్లు పలువేసములం దిరిగెన్ విలాసియై.

సీ. బ్రాహ్మణోచితములౌ బహుసంపదలతోడఁ
దనయిల్లుపూర్ణమై తనరుచుండ
సకలవిద్వల్లోకసంసేవ్యమై ప్రీతి
కూటాగ్రహారంబు కొమరుమిగుల
బాలిశత్వముచేతఁ బరదేశములలోని
వింతలఁ జూడంగ వేడ్కపడుచుఁ
జుక్కలలో వెల్గురిక్కరాయనిలీలఁ
బలువురు చెలికాండ్రు బలసికొలువ

గీ. దీర్ఘకాలంబు దేశముల్ దిరిగి తిరిగి
రాజకులముల వైభవరాజిఁ గాంచి
గురుకులంబులఁ బండితగోష్ఠు లరసి
సకలశాస్త్రార్థవాదంపుసరణు లెఱిఁగి. 129

సీ. దానలోలుపమిళిందవ్రాతఝుంకార
సంకులగజరాజసమధికములు

వాదావహాసముద్ధపరుషతర్కచ్ఛటా
పరశుపాటితవైరిపక్షసభలు
ధర్మాధికరణనిర్ధారితాఖిలలోకి
కార్థపరీవాదనాకులములు
వారనారీనాట్యపారంపరీరణ
న్మంజీరకలనాదమంజులములు
గీ. సకలసామంతరథవాజిసంకులములు
భటసురక్షితవిశిఖావిభాసితములు
భూతలస్వర్గలోకముల్ భూపకులము
లఖిలదేశాంతరంబుల నరసి యరసి. 130

శా. వేదాంతార్థవిచారసారమతుల న్విద్వాంసుల న్గొల్చి కా
ణాదన్యాయవిదగ్రగణ్యులను సన్మానంబునం గాంచి భా
ష్యాదిగ్రంథరహస్యవిచ్ఛురణ సేవాఽవాప్తవిజ్ఞానినై
వాదద్యూతపణంబుల న్గెలిచి యావత్సాన్వయుం డంతట౯.

గీ. లోకవృత్తంబు లెఱిఁగి యస్తోకశాస్త్ర
పద్ధతులఁ గాంచి శిల్పసంపదలు దెలిసి
నిజకులోచితవిద్యావినీతమతిని
శాంతుఁడై వచ్చె జన్మదేశంబుఁ జూడ. 132

మ. చిరకాలాగతబంధుదర్శనసము
త్సేకంబునన్ జ్ఞాతు లం

దఱు బాష్పాంబుకణాకులాక్షు లయి సం
దర్శింపఁగా వృద్ధు లం
దఱు 'రా' తండ్రి! సుఖంబె నిన్నుఁ గని యె
న్నాళ్లాయె దీర్ఘాయువం
చరయన్ మిత్రగణంబు లాతురత గా
ఢాశ్లేషముల్ సేయఁగన్.

గీ. బాలమిత్రసమగ్రవిభ్రాజమాన
మండలంబున ముక్తునిమాడ్కి నతఁడు
ననుభవించె మహానంద మనుదినంబు
బందుగులయిండ్ల విందుల నందుకొనుచు. 134

మ. భరతాభ్యర్చితపాదుకాయుగ! యుగప్రస్పర్ధిదోర్దండదం
డరతోదగ్రదశాస్యకంఠవనలుంటాకాస్త్ర! అస్త్రాహతో
త్తరవారాశిమహాంతరీపగతదైత్యా! దైత్యరాజేంద్రసో
దరభక్తాభయదాన! దానవగజేంద్రప్రౌఢపంచాననా!

క. ఘోరాకూపారపయో
వారవిశోషణపటిష్ఠబాణోజ్జ్వలవి
స్ఫారశరాసనభూషిత
భూరిభుజా! వనధినాథపూజితచరణా!

స్రగ్విణి. శ్రీవధూరోజకాశ్మీరవత్రాంచితా !
దేవతామౌళిసందీప్తపాదాంబుజా !
ద్యావనీపారిజాతోద్యమప్రీతస
త్యావధూనాయకా ! యాదవోద్ధారకా !

— గద్యము. —

ఇది శ్రీకొమాండూరు కృష్ణమాచార్యప్రణీతం బయిన యాంధ్రహర్షచరిత్రం బనుమహాప్రబంధంబునందు వాత్స్యాయనవంశవర్ణనం బనునది ప్రథమాశ్వాసము.



శ్రీయజ్ఞపతయే నమః.

# ఆంధ్ర హర్షచరిత్ర



## తీయాశ్వాసము



రమణీయోరస్స్థల !
నీరదశుభవర్ణ ! క్షీరనీరధిశయనా
సారసదళలోచన ! సం
సారపయోనిధినిమగ్నజనసేవ్యపదా ! 1

మ. అతిగంభీరనృపాలకూపములు దివ్యాంబుప్రపూర్ణంబు లా
యతసోపానవివర్జితంబు లయి పాంథానీకము ల్సేరఁగా
నతిభీతి న్గలిగింప రమ్యగుణమాహాత్మ్యంబునం దత్సమీ
హితము ల్పార్థివకృష్ణరూపఘటకం బీడేర్చు నిచ్ఛారతిన్.

గీ. దివసకరలక్ష్మిఁ గొనిపోయి దినముఖండ
రాగవతి యగుపద్మినీరమణి కిచ్చు
సతతము పరోపకారులౌ సాధుజనులు
పరులగుణదోషముల నెన్నఁ బాటుపడరు. 3

సీ. నిరతాధ్యయననాదనీరంధ్రముఖలస
ద్వటులోకసంకులాభ్యంతరములు
శుచివారిసంసిక్తసోమకేదారికా
హరితాయమానబాహ్యాంగణములు
శుద్ధాజినవికీర్ణశుష్యత్పురోడాశ
యోగ్యనీవారసంయోజితములు
నిజశిష్యజనసమానీతసమిత్పుష్ప
ఫలమూలకుశసముద్భాసితములు

గీ. గోమయేంధనపిండసంకుచితనిష్కు
టాతపవిలంఘ్యమానవత్సానుధావ
నార్భకమనోహరములు వత్సాస్యవాయ
వాసనసతులు నిగమసంవాసితములు. 4

చ. నిరతము హోమధూమమలినీకృతనిష్కుటవృక్షవాటికో
పరిశుకశారికాపఠితసైదికవాఙ్మదితాతిథివ్రజా
భరితము కృష్ణశారపశుబంధనఖాదిరయూపసూచితా
ధ్వరవరకర్మ మింపెసఁగు వత్సనివాసము శ్రీనివాసమై. 5

గీ. పంక్తిపావను లైనయాబంధుజనుల
నిర్మలావాసముల నహర్నిశము బాణుఁ
డమరలోకసుఖంబుల ననుభవించెఁ
బరమసంతోషమున గొన్ని వాసరములు. 6

ఉ. అంత లతాంతకాంతసమయాంతవిజృంభితచండభాస్కరో
ద్వాంతనితాంతవహ్నికణతప్తమహాగజయూథగాహిత
ప్రాంతసరోవరాంతరము భానుకరానలశుష్యదంబుసం
భ్రాంతఝుషంబు గ్రీష్మమతిభాసురమయ్యె వనాంతరంబులన్.

శా. సంతప్తోగ్రభుజంగఫూత్కృతమరుత్సంవర్ధితోద్దామదా
వాంతర్వహ్నిశిఖాస్ఫుటజ్జరఠవేణ్వగ్రోచ్చలన్మౌక్తికా
క్రాంతానంతదిగంతకీచకమహాకాంతారనిర్వాంతధూ
మాంతఃపాతిఖగాతిభీషణము గ్రీష్మారంభ మొప్పె న్వనిన్.

ఉ. చండరయప్రవిష్టఘనశైలదరీజనితప్రఘోష ము
ద్దండపరాగపాండురలతాతరుగుల్మవిధూననోగ్రవే
దండ మఖండరేణుమయదారుణమండలమధ్యసంభ్రమ
త్పాండురపత్ర మేర్చెను నిదాఘసమీరము ధీరనాదమై.

గీ. సరసకుసుమర్తుయుగ ముపసంహరించి
సాంద్రనవమల్లికాట్టహాసములతోడ
నవతరించెను వసుధ భయంకరముగ
గ్రీష్మసమయమహాకాలుఁ డూష్మ మెఱయ. 10

గీ. అచిరనిర్జితుఁ డగువసంతావనీశు
నినువు లనఁగఁ బయఃపాననిరతి నున్న
బాలవనములఁ దయసూపుభంగి నచటఁ
జల్లనై తోఁచె గ్రీష్మర్తుచక్రవర్తి. 11

గీ. అభినవోదితగ్రీష్మనరాధిపుండు
తనప్రతాపాగ్ని శత్రువాహినులఁ గ్రాఁచి
సకలసుమబంధమోక్షంబు సంతరించి
వసుధఁ బాలించె నేకాతపత్రగరిమ. 12

గీ. శ్రీనిదాఘర్తురాజాభిషేకవేళ
మన్మథాభిఖ్య నెసఁగుసామంతుఁ డతని
చెంత నిలుచుండి గంధాంబుసిక్తమైన
మదవతీచారుచికురచామరము వీఁచె. 13

క. హిమహతకమలసుహృజ్జన
సముదయజనితాగ్రహమునఁ జండాంశుఁడు దా
హిమగిరి కభిముఖముగఁ బయ
నమొనర్చె నిజోత్తరాయణవ్యాజమునన్. 14

వ. అట్టి భయంకరం బగుగ్రీష్మసమయంబునం దొకనాఁటి
యపరాహ్ణంబునఁ బారశవుం డగుచంద్రసేనుండు ప్రవే
శించి బాణునితో నిట్లనియె. 15

మ. చతురంభోధిపరీతభూవలయరక్షాదక్షదోర్దండసం
గతచండాసివిఖండితప్రతిభటక్ష్మానాథుఁ డాహర్షభూ
పతికిన్ సోదరుఁడై నకృష్ణుధరణీపాలుండు పంపంగ నా
యతజంఘుం డొకదూత వచ్చి భవదీయాలోక మర్థించెడున్

గీ. అనుడు విస్మయమంది, లేఖాహరుండె ?
రాజమూర్ధన్యుఁ డగుకృష్ణరాజవిభుఁడు
వంప వచ్చెనే ? సేర్పు మభ్యంతరంబు
శీఘ్రమున నన నాతండు చేసె నట్లు. 17

గీ. దూరమార్గానుధావనధూళిధూస
రాంగుఁడై లేఖ తనయుత్తమాంగమందుఁ
బూని వచ్చెడుదూత దవ్వులనె సూచి
బాణుఁ డిట్లని పల్కె సంభ్రమముతోడ. 18

గీ. భద్ర ! భద్రంబె చతురబ్ధినలయితాఖి
లావనీనాథుఁ డైనహర్షాధిపునకు ?
సకలభువనైకబంధుండు చారుకీర్తి
కుశలియేకద కృష్ణరాడ్కుంజరుండు ? 19

ఉ. నావుడు భద్రమౌను నరనాథుల కంచు నమస్కరించి భూ
దేవకులావతంస ! జగతీవిభుసోదరుఁ డైనకృష్ణరా
డ్దేవుఁడు వంపులేఖ యిదె దీని గ్రహింపుఁడటంచొసంగ సం
భావన దాని నందుకొని బాణుఁడు తాఁబఠియించె వేల్మిడిన్

గీ. లేఖఁ గొని వచ్చి యున్నయామేఖలకుఁడు
దెలుపుసందేశము నెఱింగి ధీరమతులు
పరిహరింపుఁడు కాలాతిపాత మనుచుఁ
జదివె బాణుండు సంభ్రమస్వాంతుఁ డగుచు. 21

గీ. చదివి నిజపరిజనులను సాగనంపి,
మేఖలకు నంతఁ దనదుసమీపమునకుఁ
బిలిచి, సందేశ మడుగ నవిస్తరముగ
విభునిమాటలుగా వాఁడు విన్నవించె. 22

సీ. ఏకగోత్రితయును, నేకజాతితయును
నేకదేశనివాస మేకశీల
మేకక్రియారంభ మితరేతరాలోక
నాలాపనాదుల నహరహంబు
మైత్రి గల్గుచునుండు మనుజుల కవనిలోఁ
గాని మీయందు నిష్కారణముగ
ము న్నెన్నఁడును జూడకున్నను హృదయంబు
బద్ధానురాగమై పాయకుండు

గీ. నిండుపున్నమజాబిల్లి నింగి నున్నఁ
గల్వల కతండు చెలికాఁడు గాఁడె పుడమిఁ?
గాన సందేశమును సావధానమతిని
వినుఁడు మే లగు మీకు సజ్జనవరేణ్య! 23

గీ. సకలగుణానిధు లగుసాధుజనులకైన
నరులు, మిత్రు, లుదాసీను లవనిఁ గలరు
పిశునజను లొకకొందఱు విభునితోడఁ
గొండెములు మిమ్ముఁగూర్చి వాకొ్రచ్చి రయ్య! 24

క. ప్రవహించెడుజలపూరము
లవివేకులచిత్తములు గతానుగతికముల్
సువిచక్షణుఁ డైనను విభుఁ
డవినీతులు చెప్పులు గఱవ నలుగకయున్నే ! 25

ఉ. మీరలు దూరముండినను మీదుచరిత్ర మకల్మషంబుగా
నారసి యేకతంబ వసుధాధిపుతో నిటు లంటి దేవ ! య
వ్వారిజసంభవాన్వయునివర్తన ముత్తమ మెంచిచూడ నె
వ్వారలొ వైరమూని యిటుపల్కిరి సైరణ సేయఁగాఁదగున్

క. అవినయముల కాస్పద మగు
నవయౌవన మరయ నెట్టినరులకు నవనీ
ధవ ! యని నొడివితి మీకయి ;
యవుఁగా కని సమ్మతించె హర్షేశ్వరుఁడున్. 27

ఉ. రాజకులోపసర్పణవిరాగమనస్కులు గాక మీర లీ
రాజకులైకభూషణు నరాతివిభీషణు సాధుపోషణున్
భూజనమానసాంబురుహపూషుని వీతసమస్తదోషు వి
భ్రాజితచంద్రికావిమలబంధురకీర్తివిశేషు హర్షునిన్. 28

మ. సలనాభాగభగీరథప్రముఖనానాపూర్వరాజన్యని
స్తుల తేజోవిభవాభిరాము సమరస్తుత్యప్రభావుఁ భుజా
బలవిద్రావితవైరివీరధరణీపాలున్ నృపాలాగ్రణిఁ
గొలువన్ రండుసమస్తసౌఖ్యములు సేకూరున్ శుభంబయ్యెడుఁ

క. ఫలియింపనిపాదపముల
చెలువున నిజబంధుజనులసీమల మీఁబో
టులు నిల్వ మీయశోలత
లిలపైఁ బుష్పింపవలదె యిద్ధచరిత్రా! 30

సీ. ఈహర్షునకు దర్పదాహజ్వరవికార
కలుషంబు గాదు హృత్కంజ మెపుడు
గర్వమహాభీలగరళగాద్గద్యదూ
షితములు గావు భాషితము లెపుడు
హాలారసార్ద్రీకృతాననకటుగంధ
కుత్సితంబులు గావు గోష్ఠు లెపుడు
అభిమానసన్నిపాతామయనిర్మిత
స్ఖలితదుర్లలితంబు గాదు గమన

గీ. మాతనికిఁ గీర్తియందె మహానురాగ
మార్యజనములయందె రత్నాభిమాన
మమలకర్మములందె నిత్యానుషంగ
మాత్మభూజనులందె ప్రజాశయంబు. 31

గీ. అల్పపుణ్యుల కిటువంటియధిపుసేవ
కల్పశతములనైన దుర్ఘటముసుమ్ము
కాలయాపన మొకయింత గాకయుండ
నార్య! రాజకులంబు సేవ్యంబు మీకు. 32

క. అనుసందేశము మేఖల
కునివలనం దెలిసి మనము కొండలమందన్
మనుజేశభృత్యునకు నీ
వనఘా! యాతిథ్య మొసఁగు మనె సోదరుతోన్. 33

వ. అపుడు సంధ్యాసమయం బగుటయు 34

గీ. వాయసార్భకముఖరాగపాటలములు
వారె నీరెండవాగులు పశ్చిమాద్రి
కమలినీకంటకాంకురక్షతపదుండు
వోలె నినుఁ డస్తశిఖరిపైఁ గూలఁబడియె. 35

క. కెందామరగమి మ్రింగిన
చందానన్ సమసిపోయె జరఠాతపముల్
మందాలతోడ గోపక
బృందాలిలు సేరె సందెవెలుఁగును మాసెన్. 36

గీ. అట్టిరజనీముఖంబున భట్టబాణుఁ
డర్హ మగురీతి సాంధ్యకృత్యములు దీర్చి
తనగృహంబున శయనీయతలము సేరి
యొంటిపాటున నిట్లని యూహసేసె. 37

ఉ. ఎవ్వరొకో నృపాలునకు నిట్టు లకారణవైరమూని యీ
యొవ్వనిమాటలన్ నొడివి;రొక్కఁడు నాకనిమిత్తబాంధవుం

దాస్యులనండి సేవ మరయంగఁ దొలంగెను ముప్పు; గాని యే
వ్యాధిఁ బోదు హర్షపరమేశ్వరుకొల్వున కిప్పు డక్కటా! 38

ఉ. రాచకొలంబుకొల్వు సుకరం బనుటొప్పదు ప్రేష్యభావమా
మాచవిగాదు, సేవయనుమాట నిజాన్వయమందుఁ బోల దు
త్తోచములిచ్చి భూమిపతికొల్వున మన్ననఁ గాంతుమందుమా
తాత్రిచుల పొత్తువంటిది ధరాపతిసంగతి కీడగుం దుదిన్ 39

ఉ. వాదములందుఁ బండితుల భగ్నులఁ జేసి గజాశ్వరత్నభూ
పాదులఁ గొందుమన్న వసుధామరులన్ సభ భంగపెట్టి సం
పాదన సేయ దోసమగుఁ బండితగోష్ఠుల విద్య నేర్వఁగా
రాదొ? యటన్న విద్యకు విరామ మొకప్పుడుఁ గల్గ నేర్చునే.

గీ. పార్థివేంద్రునిపరిచారవర్గమందుఁ
బలుకుబడి లేదు సేవించు మెలపు లేదు
పోక తప్పదు నరనాథుముదల యయ్యెఁ
బుధహరుఁడె సర్వవిధములఁ బ్రోచుఁ గాత. 41

ఉ. ఇంతనొకింత గన్నొగిచి యాతఁడహర్ముఖకృత్యముల్ క్రియా
మాంతము నందొనర్చి సలిలాప్లుతుఁడై మడుగుల్ ధరించి య
త్యంతము భక్తి నక్షవలయంబు ధరించి ప్రయాణసూక్తముల్
శాంతివిధానమంత్రములు సంతతనిష్ఠ జపించె నెంతయున్.

సీ. శ్రీగాంగసేకంబు శితికంఠున కొనర్చి
ద్రౌపదీపాదసంతుష్టుఁ జేసి

2 హవ్యగ్రసనలేలిహానజిహ్వాంచలుఁ
బావకు భక్తి నుపాస్తి సేసి
3 వేదాభిరతు లగువిప్రోత్తములకు శ
క్త్యనురూపదక్షిణ లపు డొసంగి
4 ప్రత్యగ్రదూర్వాంకురములు మేయుచునున్న
సురభిని ముమ్మారు చుట్టి కొలిచి

గీ. రోచనాచిత్రదూర్వాగ్రరుచిరకర్ణి
కారకుసుమావతంసితకర్ణుఁ డగుచు
ధవళసిద్ధార్థకంబు తొదల ధరించి
శుక్లమాల్యానులేపనశుద్ధుఁ డయ్యె. 43

సీ. తండ్రితోఁ బుట్టువౌ తలిరుఁబోఁడి యొకర్తు
గమనమంగళకార్యకలన నడుపఁ
గాళ్ళకు మ్రొక్కినఁ గౌఁగిళ్ళ నదుముచు
వృద్ధబాంధవులు దీవించి పంప
మౌహూర్తికను తానుమతముగా జపిశలు
తారాభిముఖ్యతంత్రములు సలుప
ఫలపుష్పపరిపూర్ణపాణిపుటంబుల
బ్రాహ్మణు లప్రతిరథముఁ జదువ

గీ. హరితగోమయలిప్తాజిరాంతరస్థ
వేదికాతలవిన్యస్తవిమలమూర్తి

పల్లవాంకురమాలావిభాసివదన
పూర్ణమంగళకలశంబు ముందుఁ గనుచు. 44

గీ. ప్రథమవిన్యస్తదక్షిణపాదుఁ డగుచు
స్వస్తివాచనముఖరితవదను లగుచు
బ్రాహ్మణులు తోడ నడువంగ బాణుఁ డపుడు
ప్రీతికూటంబు వెడలె సంప్రీతుఁ డగుచు. 45

ఉ. ఆకులు లేక మోడులయి యచ్చటచ్చట నున్న పాదపా
నీకముతోడ శూన్యవలినీనివహంబులతోఁ దృషార్దిత
స్తోకమృగాళితోడ నతిదుస్సహభానుకరాళితోడ ని
శ్శ్రీకము లైనవన్యపథసీమలు కష్టమునన్ గ్రమించుచున్.

గీ. ప్రథమదివసాంతమునఁ బథశ్రాంతుఁ డగుచు
ఘర్మకాలంబునం దతికష్టమైన
*చండికావన మెల్లెల్ల నంతరించి
మల్లకూటాఖ్య నెసఁగుగ్రామంబు సేరె. 47

క. ఆయూర జగత్పతి యను
పాయని చెలికానియింట భార్యయుఁ గొలువన్
దీయనివిందుల సమ్మృష్ట
ప్రాయంబుగ నారగించెఁ బరమప్రీతిన్. 48

క. మరునాఁ డరుణోదయమునఁ
బరమోదారప్రవాహ భాగీరథి ను

త్తరియించి యష్టిసంజ్ఞన్
బరఁగెడునొకపల్లె రాత్రి బాణుఁడు గడపెన్. 49

వ. ఇట్లు ప్రీతికూటాగ్రహారంబు వెడలి మూఁడుదినంబులు
పయనంబు సేసి 50

ఉ. అంతటఁ గాంచె బాణుఁ డతిహర్షమున న్మణితోరణత్తనో
పాంతమునన్ శరజ్జలధరాయతశుక్లపటప్రభాసమా
క్రాంతములున్ సువర్ణమయకమ్రమహాకలశోపశోభితా
శాంతరము ల్నరేంద్రశిబిరావళు లుగ్రభటప్రపూర్ణముల్

గీ. కాంచి నరపాలభవనోపకంఠసీమ
విడిసి యాహ్నికవిధులు సవిస్తరముగ
నాచరించి పథిశ్రమం బపనయించి
యామమాత్రావశేషదినాంతరమున. 52

గీ. మేఖలకుఁ డాత్మమార్గసంవేదకుఁడుగ
సకలసామంతశిబిరముల్ చక్కఁ గనుచుఁ
భూపభవనాభిముఖముగాఁ బోవఁ బోవ
ముందు వింధ్యాచలోన్నతమూర్తు లొప్ప. 53

మ. మదధారార్ద్రకపోలలోలవిచలన్మత్తాళిమాలారణ
న్మృదుగీతారవమేదురాఖిలదిశల్ మేరుక్షమాభృత్తట
చ్ఛిదురకూరకఠోరదంతముసలోచ్ఛ్రిన్నారిదుర్గావళుల్
మదదంతావళము ల్గనంబడియె దిఙ్మాతంగసంకాశముల్. 54

మ. సకలద్వీపవిశేషభవ్యవిజిగీషన్ సేతునిర్మాణకా
ర్యకలాపార్థముగా సమస్తహరిదంతానంతభూమీధర
ప్రకరం బిట్లొకచోటఁ గూర్పఁబడెనో వర్షాబ్దసంఘాత ము
ర్వీకిఁ జేరన్ దిగెనోయనంగఁ బొలిచెన్ వేదండసంతానముల్

ఉ. శాతఖురాభిఘాతముఖరజస్వననిస్వనముల్ మహోజవో
ద్ధూతపురందరాశ్వములు దుర్గమకాననినిర్ఝరాద్రిసం
ఘాతవిలంఘనక్షమనిగాఢజవంబు లనేకదేశసం
భూతములు త్తమాశ్వములుపోవఁగఁ గానఁగనయ్యెముందటన్

చ. గజతురగాదిసంతతులుగాంచుచు మెల్లనఁబోయిపోయియ
క్కజముగ మిక్కిలిన్ బొడవుగల్గిన మోములపై వరాటికా
స్రజములు వింతచెన్నెసఁగ సాంద్రజవోన్నతముల్ క్రమేలక
వ్రజములు సూడనొప్పె నిజపాలకతర్జనవాక్యసమ్మితన్. 57

ఉ. శారదచంద్రచంద్రికలచందమునన్ గిరిశాట్టహాసముల్
పేరినభంగి దుగ్ధనిధిపిండితఫేనసమూహముల్ బలెన్
జారుహిమాద్రికూటములసాంద్రహరాద్రిసుపర్వవాహినీ
పూరవిపాండురంబు లటఁ బొల్చె మహాతపవారణావళుల్.

గీ. వెల్లివిరిసిన రెల్లుల వెల్లఁదనము
నిండుపున్నమజాబిల్లి పాండిమంబు
గండురాయంచపింఛులగాఢకాంతి
కరఁగి పోసినభంగిఁ జామరము లొప్పె. 59

సీ. సామజకర్ణానస క్తశంఖంబుల
హంసయూథంబుల ననుకరించి
కదళికాకాండప్రకాండావళులచేతఁ
గల్పపాదపములకాంతిఁ దెగడి
బర్హిబర్హాతపవారణవర్ణాళి
మాణిక్యవృశ్చికమహిమఁ గాంచి
ధవళాంశుకవితానధాళధళ్యంబుల
నభ్రగంగాప్రవాహంబు నవ్వి
గీ. పద్మరాగమణిచ్ఛటాపటలరుచుల
బాలసూర్యాతపంబుల భంగపఱచి
సకలరత్నప్రభాజాలచటులకాంతి
పూరముల నింద్రచాపంబుబీర ముడిచి. 60

గీ. అఖిలభువనైకమంగళాయతన మగుచు
రణవినిర్జితసామంతరాజలోక
సేవ్యమానాజిరం బయి చెన్ను మిగులు
హర్షవిభుమందిరద్వార మల్లఁ గనియె. 61

సీ. తరణి గుర్రించెనుదాఁక దర్శనాకాంక్షులై
కొలిచియుండినరాచకొలము వారు
దావారికులచెంతఁ దమరాక మొరవెట్టి
యధిపుఁ జూడఁగ వేళ లరయువారు

నాల్గువారాసులనడుదీవు లేలెడు
రాజులరాయ బారములవారు
హూణాధిపులు వంపునుపదానములఁ దెచ్చి
కాచియుండినయమూడిగములవారు

గీ. కంచుకోష్ణీష ధారులౌ కటికవారు
సకలదేశాగతులు మ్లేచ్ఛజాతివారు
నుచితరీతులఁ గొలువంగ నొప్పుచున్న
సార్వభౌముని మొగసాల చక్కఁ గనియె. 62

వ. అప్పుడు బాణుండు 63

ఉ. ఇంతటిప్రాణిజాతము సృజింపఁగ భూతము లైదునొక్కమా
రంతమునొందకుండు నెటు లక్కజమౌ పరమాణుసంతతుల్
స్వాంతముగాకపోవు నెటు లాయువు నల్వకుఁ గ్రుంగదేలొకో
చింతకు దూరమైన దిది చిత్రమటంచుఁ దలంచె నాత్మలోన్

క. దూరంబుననుండియె దా
వారికు లామేఖలకు నవారితగతిఁ బో
దారి యొసంగిన వాఁడు ను
దారత నరపాలుసన్నిధానంబునకున్. 65

క. అరుగుచు నిట్లని పల్కెను
బరమేశ్వరు నొద్ద కేగి పటుజవమున నే

సరుదెంతు ముదలఁ గైకొని
ధరణీసురవర్య ! నిలువఁదగు నిట మీరల్. 66

మహాస్రగ్ధర. అని వాఁ డత్యంతవేగం బడరఁగఁ జని దీ
ర్ఘాంగు నాజానుబాహున్
గనకాంచత్పట్టబంధగ్రథితకటితటా
కల్పితోద్యత్కృపాణున్
దినకృద్దీప్రప్రకాశద్విగుణరుచిలస
ద్దివ్యరత్నాఢ్యహారున్
ఘనవక్షున్ గౌరకాయున్ గరకమలచల
త్కాంచనోదగ్రవేత్రున్. 67

గీ. పాండురోష్ణీషకంచుకప్రథితవేషు
రాజపురుషుని నొక్కని రయముతోడ
మేఖలకుఁ దంతఁ గొనివచ్చి మిగులవినయ
వినమితాపఘనుం డయి విన్నవించె. 68

గీ. సార్వభౌమప్రతీహారసంఘమందు
ఆర్య ! చక్షుష్యుఁ డీతఁ డాయవనిపతికిఁ
బారియాత్రాభిధానదౌవారికాగ్రి
గణ్యుఁ డీతనిఁ గనుఁడు విఖ్యాతయశుని. 69

క. అని చూపి చెప్పుటయు నా
జనవిభుదౌవారికుండు సస్మితముఖుఁడై

యనఘా ! దేవర దర్శన
మునకై వేంచేయుఁ డవనిపుఁడు కరుణించెన్. 70

ఉత్సాహ. అనుచుఁ బారియాత్రుఁడిట్టులవనివిభునియానతిన్
వినయమొప్ప విన్నవింప వేడ్క భట్టబాణుఁడున్
జనవిభుం డనుగ్రహించెఁ జాలధన్యతముఁడ నే
ననుచు నతనిపజ్జ లోని కరిగె సంతసంబునన్. 71

వ. ఇ ట్లరుగుచుఁ బురోభాగంబున. 72

సీసమాలిక. బాహ్లీకకాంభోజపారసీకవనాయు
జారట్టజాదిజాత్యన్వితములు
ఖాదిరయూపానుకారికంధరములు
పటుదీర్ఘనిర్మాంసవదనములును
భూతలవలమానపుచ్ఛాగ్రభాగముల్
కాలాయసకఠోరఖరఖురములు
గాఢజంఘాకాండకలితగాత్రంబులు
వృత్తాయతశ్రవణవిలసితములు
చరణైకవిశ్రాంతజఘనభాగంబులు
నిద్రానిమీలితనేత్రములును
స్ఖలితహేషారవోత్కటకటారావముల్
భూరిశఫఘట్టనభూతలములు

ప్రకుపితచండాలభయదహుంకారకా
తరతరతారళ్యతారకములు
పీతనీలశ్వేతపింజరశ్యామల
రక్తకర్బురవర్ణరాజితములు
గీ. బహుగుణోత్తరపాశనిర్బంధితములు
రాజవల్లభములు వాతరంహసములు
పంచభద్రంబు లాదిగా బహుతురంగ
జాతు లటఁ బొల్చె సైంధవశాలలందు. 73

గీ. మందురాలోకనానందమగ్నుఁ డగుచు
హస్తవామంబుగా బాణుఁ డరిగి యచటఁ
గాంచె వకుళోపమామోదకలితమదము
దర్పశాతాభిధానదంతావళంబు. 74

మహాస్రగ్ధర. గళగంభీరోగ్రగర్జల్ ఘనరవములుగా
గాత్రనైల్యంబు ప్రావృ
డ్జలదాచ్ఛచ్ఛాయ నింపన్ సతతకరటని
ష్యందిదానాంబుధారా
జలపూరం బొప్ప దంతచ్ఛవిచటులతటి
చ్చండరుగ్జాల మీనన్
జెలఁగెన్ నాగంకైబకస్మాద్ క్షితిపతితరట
చ్ఛేత్రిష్టవర్షాబ్దలీలన్. 75

సీ. గాత్రికండూతికై కకుబంతముల రాయ
నొగి ముందునకు వెన్క కూఁగుదాని
దంతద్యుతులచేతఁ దాను మ్రింగినయట్టి
కమలవనంబులఁ గ్రక్కుదానిఁ
బటుదీర్ఘతుండంబు పైకెత్తి యుద్ధంపు
వేడ్క దిక్కరులను బిల్చుదాని
ఘర్మశాంతికిఁ బైని గజపాలకులు సల్లు
శీతాంబువులఁ జొక్కి చెలఁగుదాని

గీ. సమరజంగమదుర్గమై యమరుదాని
నరులపాలిటిమృత్యువై మెఱయుదానిఁ
బార్థివేంద్రునిగంధద్విపంబుఁ గాంచెఁ
బరమసంతోషమున భట్టబాణుఁ డపుడు. 76

వ. కని తనమనంబున నిట్లని వితర్కించె. 77

గీ. ఈమహాగజనిర్మాణ మిచ్చఁ దలఁచి
నలువ గిరులను బరమాణువులుగఁ గొనియొఁ
గాని లేకున్న నీగాత్రిగౌరవంబు
నీమహాప్రాణతయు నద్వి నెందుఁ గలవు ? 78

చ. కరముధరించి యుర్విపయిఁగ్రాలెడునాదివరాహమూర్తి యో
ఘనుఁడజరద్గతకాండముల నొప్పనవింధ్యమహాధరంబొకో

కను లవియేడ యీవిపులగాత్రమహోన్నతి యేడ యక్కజం
బెఱుఁగమె వారణేంద్రముల నిట్టివి గల్గునె భూతలంబునన్?

క. అని తలఁచుచుఁ గరిపతిపై
నెనసినతనచూపుఁ ద్రిప్పనేరక యున్నన్
జనపతిగ్గాం వారికిఁ దతి
వినయంబునఁ బలికె నపుడు విస్ఫుటఫణితిన్. 80

గీ. మరలఁ జూతుముగాక యీమత్తగజము
ముందు భూపాలు సేవింపఁ బోవనలయు
ననుచుఁ బెను వెఱఁగింపుచు నతఁడు నడువ
వివిధకక్ష్యాంతరంబులు వేగఁ గడచి. 81

సీ. వ్యాయామకర్కశవ్యాయతదేహులు
సాలమహీరుహోత్తాలతనులు
కార్తస్వరస్తంభగౌరశరీరులు
పటుదీర్ఘనిస్త్రింశభయదబాహు
లత్యుత్తమక్షత్రియాన్వయసంజాతు
లధిపసంరక్షణావ్యగ్రచిత్తు
లగురాజపుత్రు లాయత్తులై తనుఁ గొల్వ
దంతపర్యంకికాతలమునందు

గీ. ఇష్టజనులను గూడి యథేష్టలీల
సముచితాలాపములఁ బ్రొద్దు జరుపువాని

నీలమణిపాదపీఠిపై నిజపదంబు
లూని కూర్చున్నవాని భూజానిఁ గనియె. 82

వ. కని తనమనంబున 83

శా. ప్రాలేయాచలసానుసారమయి భాస్వద్రాజ్యలక్ష్మీలస
ల్లీలామందిరమై గజేంద్రదశనోల్లేఖాంకితంబై మహా
నీలాశ్మస్థగితోరుహారయుతమై నీరంధ్రముక్తాఫల
ప్రాలంబాంచితమైనవక్షము మహారాజ్యార్హతం దెల్పెడిన్.

మ. సమమై రావణతుండకర్కశములై సంగ్రామభీమంబులై
రమణీయాంగదభూషితంబులయి సుత్రామధ్వజాభంబులై
సముదగ్రాద్రిసరిత్సముద్రసహితక్ష్మాచక్రధుర్యంబులై
సుమహాదీర్ఘములైనబాహువులు మహాశూరత్వముం దెల్పెడిన్

ఉ. ఈయన సర్వలోకముల నేలఁగఁబుట్టిన యట్టియాదినా
రాయణుఁ డుత్పథానుగలయాంతకుఁ డార్యజనాతిసౌఖ్యసం
ధాయకుఁ డీమహాత్ము నిజనాథునిగాఁ గని నేఁడు ధన్యమై
పోయెను ధాత్రి దుష్టనరపుంగవసంగమదోషముక్తమై. 86

గీ. సౌమ్యసుందరవదనప్రసన్నతయును
గనుదయారస మొల్కెడుకన్నుఁగవయు
గాఢతేజంబు గాంభీర్యగరిమ గూడి
కౌతుకంబును సంత్రాసకము సల్పె. 87

మ. ఇతఁ డేకాతపవారణంబుగఁ బ్రజావృత్తంబు ధర్మైకధీ
రతిఁ బాలింపఁగ భూతధాత్రి గనియెన్ రాజన్వతీసంజ్ఞ ని
ర్వృతిఁగాంచెన్ హరిమారుతోన్నతభుజంగేంద్రాంకపర్యంకసం
స్థితలక్ష్మీకుచపత్రభంగరచనాశిల్పప్రగల్భాత్ముఁడై. 88

వ. అని వితర్కించుచు 89

గీ. దృష్టిచిత్తాపహారులై తేజరిల్లు
హార్ష విభురూపగుణముల కాత్మ నలరి
యతనికడ కేగి దక్షిణహస్త మెత్తి
స్వస్తిశబ్దం బొనర్చె సుస్వరయుతముగ. 90

ఉ. చారుతుషారభూధరవిశాలగుహాంతరసింహనాదగం
భీరరవంబునన్ దెసలు బీటలువార విభుండు వల్కె దౌ
వారికుఁ జూచి యీతఁడొకొ బాణుఁడనంజనువాఁడటంచు రో
షారుణనేత్రయుగ్మజరతాతప మంబరపూరితంబుగన్. 91

క. దేవా! చిత్త మటంచును
దౌవారికుఁ డపుడు వల్క ధరణీపతి తా
నావలిమొగమై మాలవ
భూవిభుసుతుఁ బ్రియవయస్యుఁ బొడఁగని పలికెన్. 92

గీ. శుద్ధచారిత్రుఁ డితఁ డనుబుద్ధి నాకుఁ
గలుగునంతకుఁ గను విచ్చి కాంచ నితని;
ఈభుజంగునితోడ నా కేటిమాట
లనుచు రారాజు పెడమొగమయ్యె నపుడు. 93

ఉ. కొలువునరాచవారు నృపకుంజరుకోపముసూచి యొక్కరు
న్బలుకఁగనేరకున్నతఱి బాణుఁడు "దేవ! జగంబునరత్నం
బులతెఱఁగెల్ల నారసియు ముగ్ధునిమాఱ్కి నచించె దేలొకో
కలవిధమెల్ల నిక్కువమె కల్లయొ చూడక నిగ్రహింతురే.

క. లోకము గతానుగతికము
ప్రాకటముగ జనులలోఁ బ్రవాదము లుంచున్
దేఁకువ గలధీమంతు లవి
వేకులవాక్యములు చెవినిఁబెట్టం దగునే? 95

ఉ. న్యాయపథైకనిష్ఠులు మహాత్ములు సోమకపాయితోడరుల్
ధీయుతు లార్యసమ్మతులు దీక్షితులున్ ఋషికల్పులైనవా
త్స్యాయనవంశపూరుషులయందు జనించితి నష్టవార్షిక
ప్రాయమునందు వర్ణనము వైదికవాఙ్మయముం బఠించితిన్.

గీ. అంగయుతముగ వేదంబు లభ్యసించి
సకలశాస్త్రార్థములు యథాశక్తిఁ దెలిసి
దారసంగ్రహ మొనరించి ధర్మనిరతిఁ
జెలువుచున్నాఁడ గార్హస్థ్యసమయ మిప్పుడు. 97

ఉ. నాయెడ దోసమేమి నరనాయక! నిగ్రహమూన? నెవ్వరో
దాయలు సెప్పుమాట లవి తథ్యములం చెద నమ్మి నీవు నా
చాయను జూడకుంటివి; ధరిత్రిని నాయెడ లేదు; శైశవ
ప్రాయము కొంత చాపలవ[illegible] నిక్కమింతయున్.

క. భూపా ! దానికిఁ బశ్చా
త్తాపం బెదఁ గలదు నీవు ధర్మాభిరతిన్
భూపాలన మొనరింపఁగ
లోపంబులు గలవె జనులలోఁ బరికింపన్. 99

గీ. చండభానుఁడు తపియించుసమయమందు
నిండ నేర్చునె తమము లఖండ తేజ !
చండశాసనుఁ డగుహర్ష చక్రవర్తి
మండలంబునఁ గలఁడె యున్మార్గవర్తి ? 100

సీ. నీశాసనంబున నిశి జక్కవలుగూడఁ
గవఁ గూడఁ జాలక నవయుచుండు
నీశాసనంబున నెత్తమ్మివిరిదేనెఁ
ద్రావంగ మధుపముల్ దలఁకుచుండు
నీశాసనంబున నిశ్చయంబుగఁ గపుల్
చకితంబులై చూపుఁ జాపలములు
నీశాసనంబున నిఖిలవన్యమృగాళి
పిశితంబు భక్షింప వెఱచుచుండు

గీ. ననఁగఁ బానంబు వేఁట పరాంగనాను
షంగమును జాపలంబును జగతిఁగలవె ?
నాయుదంతంబు హర్షభూనాథ ! మీకు
నంతయును దెల్లమగును గాలాంతరమున. 101

గీ. అనుచు బాణుండు వల్క హర్షావనీశుఁ
డతనిఁ గ్రేఁగంటఁ జూచి 'యే మట్ల వింటి'
యనుచు నూరకయుండెఁ దా నంతెకాని
యాసన మొసంగి మాటాడి యంపఁడయ్యె. 102

క. కేవల మమృతమయంబులు
పావనములు నైనదృష్టిపాతంబుల నా
భూవిభుఁడు హృదయగతస
ద్భావంబును వెల్లడించె బాణున కంతట. 103

వ. దివసంబు పరిణతప్రాయం బగుటయు. 104

సీ. ఆరకూటకఠోరచారుకాంతులతోడఁ
జరమాద్రిదరుల భాస్కరుఁడు సేరె
నెమరువేయుచుఁ గురంగములు శాద్వలభూమిఁ
గను మూసి విశ్రాంతిఁ గనుచునుండె
శోకాకులం బైనకోకాంగనాపాళి
సరసీతటంబుల నఱచుచుండె
నానాసవృక్షశాఖాగ్రంబులను వ్రాలి
పులుఁగు లొండొంటిని బిలఁగి పిలిచె

గీ. దివస మంతయు వనములఁ దిరిగి తిరిగి
సంజకడ నిల్లు సేరినసౌరభేయి

తర్ణకంబును జన్నిచ్చి తనుపుచుండె
జరఠసూర్యాతపంబులు చదలఁ బాదలె. 105

చ. చరమమహీధరాగ్రతటసంగతగైరికధాతునిర్ఝరో
త్కరములఁ దానమాడినవిధంబున శోణరుచిన్వహించె భా
స్కరుఁడు; జరన్మహీరుహవిశాలబిలోద్గతకాకభీరుభీ
కరఖరఘోషము ల్నెలఁగెఁ గంపితశైలగుహాంతరంబులై.

సీ. యజ్ఞపాత్రపవిత్రహస్తులై గృహమేధు
లగ్నికార్యవ్యగ్రు లగుచునుండ
నిద్రానిమీలితనేత్రయుగ్మంబులై
యండజంబులు కులాయముల నొదుగఁ
గాలకాసరకాయకాంతులఁ దులఁదూఁగు
తిమిరసంతానముల్ దెసల నిండ
నగ్రజక్షిప్తసంధ్యావందనోదబిం
దువు లనఁ దారకల్ దివి వెలుంగ

గీ. శిశుజనంబులు వృద్ధులు సెప్పుకథల
నాలకించుచు సుఖనిద్ర నందుచుండఁ
జరమసంధ్యాంధతమసంబు జటిల మగుచుఁ
గాతరస్వాంతసంత్రాసకారి యయ్యె. 107

సీ. కుసుమకోదండుండు కుంచితపాదుఁడై
శరవృష్టిఁ జక్కాడె విరహిజనుల

వెలిచపుల్ మరగినకులసతుల్ ప్రియులతోఁ
గుట్టనీగృహములఁ గూడఁ జనిరి
మార్గసహాయుఁడై మదనుండు తోడరా
నడురేయి శూన్యమౌ నగరవీథి
నీలనిచోళంబు నిండార ముసుఁగిడి
మంజీరశబ్దంబు మాటువఱచి

గీ. చీమ చిటుకన్నఁ జేరెనో చెలువుఁ డనుచు
ముసుఁగుఁ దొలఁగించి జాబిల్లిఁ బోలుమొగము
వెన్నెలలు గాయఁ జూచుచు వెఱపులేక
యరిగి రభిసారికలు ప్రియు లాత్మ నలర. 108

వ. అప్పుడు బాణుఁడు సమయోచితకృత్యంబులు దీర్చి శ
యనతలంబుఁ జేరి యాత్మగతంబున. 109

ఉ. ఎంతటివాఁడు హర్షపరమేశ్వరుఁ డెంతటిధర్మమూర్తి దు
శ్చింతులమాటలం జెవిని జేర్చఁడు దోస మొకింత గల్గినన్
శాంతమనస్కుఁడై సయిచెఁ జల్లనిచూపులఁ జూచె నిర్మల
స్వాంతుఁడనై మెలంగవలెనంచును గోపమునూని నేపునన్

గీ. ఇతనినరనాథమాత్రుఁ గా నెదఁ దలంచి
పాప మొనరించితిని భూమిపాలునెడల
నాదుకలరూపు హర్షభూనాథుఁ డింకఁ
గాలవశమునఁ దెలియంగఁ గలఁడు సుమ్ము. 111

గీ. దోషదూషితుఁ డైయున్న దుర్జనుండు
పరులగుణముల గణియింపఁ బాటువడునె
దర్పణము దుష్టమై యున్న దానియందు
వస్తుయాథాత్మ్యరూపంబు వడయ నగునె ? 112

గీ. ఇట్లు దలపోసి యారాత్రి యెట్లొ గడపి
వేకువను లేచి కటకంబు వెడలివచ్చి
ప్రీతికూటంబు సేరి సంప్రీతితోడ
బందుగులయిండ్ల సుఖముండె బాణుఁ డంత. 113

గీ. కొలఁదిదినములలోన నాకువలయేశుఁ
డతనివర్తన మంతయు నాత్మఁ దెలిసి
గారవంబొప్పఁ బిలిపించి కడుముదమున
సర్వసమ్మానములతోడ సత్కరించె. 114

మ. ధరణీనాయకుఁ డాదినంబు మొదలాస్థానంబునన్బాణునిన్
వరభూషాంబరవాజివారణమణిప్రాలంబముక్తాఫలో
త్కరకేదారమహాగ్రహారముఖసత్కారంబులన్నిత్యమున్
బరమోదారత నాదరించె నిజసద్భావంబు దీపింపఁగాన్.



ఉ. నతపాదాంగుళిధూతదుందుభికబం
ధా ! బాంధవోత్సారితా

నతసుగ్రీవవరప్రదా ! ప్రదరకో
ణజ్వాలికావిద్ధన
ప్తతరుత్కాన్తల ! త్కాన్తలావనసమ
ర్ధప్రౌఢదోర్దండదం
డితపాలస్త్యముఖాసురా ! సురధునీ
నీలోత్పలాచ్ఛద్యుతీ !

క. సత్యాజాంబవతీప్రియ !
రత్యాప్యాయితత్రివక్ర ! రాక్షసభీతా
దిత్యార్థితావతారా !
నిత్యానందస్వరూపనిర్మలతేజా !

ధుర్యనకోకిల.

యదుకులోద్భవ ! యోగిచిత్తవిహార ! మాధవ ! కేశవా !
కదనభూతలచక్రవిక్రమ ! ఖండితాసురనాయకా !
వదనకాంతివినిర్జితామలపార్వణేందుమహాద్యుతీ !
సదననిష్కుటసుప్రతిష్ఠితచారుకల్పమహీరుహా !

—• గద్యము. •—

ఇది శ్రీనామాండూరు కృష్ణమాచార్యప్రణీతం బయిన
యాంధ్రహర్షచరిత్రం బను మహాప్రబంధంబునందు
రాజసందర్శనం బనునది
ద్వితీయాశ్వాసము.

శ్రీయజ్ఞపతయే నమః.

# ఆంధ్ర హర్షచరిత్ర

## తృతీయాశ్వాసము



కర ! రఘుకులజలధిసు
ధాకర ! దృఢదీర్ఘబాహుదర్వీకరరా
డ్భీకరరసనాయితబా
ణాకర్షణవినతభార్గవాన్వయరామా ! 1

క. వర్షాహితసుస్నేహో
త్కర్షము బహుభక్తలోకగంభీరమునై
హర్ష మొసంగు సుకాలము
కర్షకులకుఁబోలె నృపతి కాంతగుణుండై. 2

గీ. సాధుజనులకు నుపకృతి సల్పుటకును
గగనమునఁ బోవ, సిరిఁ గాంచ, ఘనతపస్వి
జనులచరితంబు వినఁగ నేజనునిహృదయ
సారసంబునఁ గలుగ దుత్సాహగరిమ ? 3

శా. ధౌతాసిప్రతిమాంబరంబు విగళత్సౌదామనీదామ ము
ద్ధూతాంభోధరమండలం బహిమరుగ్దుర్వారభాస్వత్కర
స్ఫీతాంభోరుహషండసంగతరటద్భృంగీసమారబ్ధసం
గీతం బొప్పె శరత్సమాగమము లక్ష్మీకాంతనిద్రాంతమై.

ఉ. చాతకలోకభీకరము చంద్రికశూన్యశిఖావళంబు ని
ర్ధూతసురేంద్రకార్ముకము దుర్దినకర్దమమర్దనాతపం
బాతతహంససారసరవాకులపాంథజనంబు యూథికా
వ్రాతసుగంధిమారుతము భాసురమయ్యె శరద్దినం బిలన్.

ఉ. చారుతుషారబింబరుచిసాంద్రములున్ బరిపక్వశాలికే
దారము లుల్లసత్తరళతారకపంక్తులు ఫుల్లమల్లికా
హారులు మోదమానకుముదాకరముల్ శరపుష్పరేణుసం
భారసమీరముల్ వొలిచె భాసురశారదవాసరావళుల్.

గీ. అట్టిశారదవేళ రాజాజ్ఞ వడసి
బంధుతాదర్శనార్థియై బాణుఁ డరిగె
బ్రహ్మఘోషానునాదితప్రాంగణంబు
ప్రీతికూటంబు నిజమనఃప్రియకరంబు. 7

మ. ధరణీనాయకు కొల్వుకూటమున విద్యావైభవోపార్జిత
స్థిరలక్ష్మీయుతుఁడై కులస్థవిరసంసేవాపరత్వంబునన్
జిరకాలంబున కాత్మభూమి కరుగం జిత్తంబు లుప్పొంగఁగాఁ
బరమప్రీతిని వచ్చి బాంధవులు సంభావించి రాబాణునిన్. 8

క. కులవృద్ధులకును గురుపద
జలజంబుల కప్పు డతఁడు సాఁగిలి మ్రొక్కన్
జలజల సమ్మోదాశ్రులు
పులకలు వొడమంగ వృద్ధభూసురు లతనిన్. 9

క. దీవించి కుశల మారసి
లేవంగాఁ దిగిచి కౌఁగిలింపుచు వత్సా!
నీవంటివానికతమున
మావత్సాన్వయము రాజమాన్యం బయ్యెన్. 10

ఉ. సేమమె చక్రవర్తికి విశేషము లేమి సభాంతరంబునన్
నీ మొగ మిన్నినాళ్లుఁ గననేరక కన్నులు వాచిపోయెఁ దం
డ్రీ! మముఁజూచు వేడ్కఁ బరమేశ్వరునానతిఁబూనివచ్చితే
మామనముల్ప్రమోదరసమగ్నములయ్యెను వంశభూషణా!

గీ. అనుచు గురుజను లగ్గింప నాత్మ నలరి
బందుగులు సేయుపూజల నందుకొనుచు
నచటివారలసేమంబు లరయఁగోరి
పలికె బాణుండు సంభ్రమస్వాంతుఁ డగుచు. 12

సీ. ఇంతకాలము మీర లిందఱు సుఖమున్న
వారలేకద హవ్యవాహనుండు
సప్తజిహ్వాగ్రముల్ చవులూర మంత్రిస
త్కృతపురోడాశసంతతులు గొనునె

తోషితద్విజచక్రభూషితంబులు మహా
ధ్వరము లవిఘ్నమై వఱలునొక్కొ
ఉచితకాలంబున నుపనీతులై బ్రహ్మ
చారు లధ్యయనంబు సలుపువారె

గీ. జైమినీయాక్షపాదశాస్త్రప్రసంగ
మహిపతీరితభాష్యవాక్యార్థగోష్ఠి
సరసకావ్యసుధారసాస్వాదసరణి
పూర్వ ముండినరీతి నిప్పుడును గలదె ? 13

వ. అనుటయు వార లిట్లనిరి. 14

క. నైతానవీతిహోత్రస
మేతులమై ప్రీతితోడ మెలఁగుచు విద్యా
చాతుర్యలీలఁ గాల మ
నాతురతం బుచ్చుమా కనామయ మనఘా ! 15

మ. భుజగాధీశ్వరదేహదీర్ఘభుజుఁ డాభూమీశ్వరుం డుర్వరా
ప్రజలన్ బిడ్డలకై వడిన్ మనుపఁ దత్పార్శ్వస్థపీఠంబు వి
ప్రజను ల్సంతసమంద నీ వధివసింపన్ మాదృశబ్రాహ్మణ
వ్రజసౌఖ్యంబుల కేకొఱంత గలుగున్ వత్సాన్వయగ్రామణీ!

గీ. శక్తివంచన లేక నైశ్వర్యమునకుఁ
దగినరీతిని గాలంబు దప్పకుండ

విప్రజనమాన్యవైదికవిధుల నెల్ల
నొకవిధంబునఁ దీర్చుచునుంటి మయ్య ! 17

వ. అనుటయు సంతుష్టాంతరంగుండై 18

మ. వరుసన్ వారలసేమ మిట్లరసి సంభావించుచున్ హర్షభూ
వరునాస్థానములోనివార్తల నిజాప్తశ్రేణికిం దెల్పుచున్
బరమప్రీతిని బాల్యచేష్టితములన్ భావించి భాషింపుచున్
జరిపెన్ బాణుఁడు కొంతప్రొద్దచట విస్రంభానులాపంబులన్

క. అపుడు లలాటంతపుఁడై
తపనుఁడు నడుమింట వెలుఁగఁ దత్కాలవిధుల్
సపరిచ్ఛదముగఁ దీరిచి
యపరిమితామోదయుతహృదబ్జుం డగుచున్. 20

గీ. ఇష్టజనులను గూడి యభీష్టలీలఁ
గుడిచి కూర్చున్నతఱిఁ బాణుఁ గొలిచియుండి
రచటిబంధుజనంబు లత్యాదరమునఁ
బద్మభవుఁ గొల్చుదేవర్షివార మనఁగ. 21

ఉ. ధౌతదుకూలపట్టపరిధానముఁ దాలిచి తీర్థమృత్తికో
పేతముగా లలాటమునఁ బెట్టినరోచనరేఖతోడ సం
స్ఫీతలతాంతశేఖరకవేష్టితసూక్ష్మశిఖాకలాపుఁడై
చేతము లుల్లసిల్ల నటఁ జెచ్చెర వచ్చె సుదృష్టిహృష్టుఁడై.

గీ. అసకృదుపయుక్తతాంబూలరసవిభాసి
తాధరుండును సకృదంజనాక్తనేత్రుఁ
డగుచుఁ జనుదెంచి నికటవేత్రాసనంబు
నచిరభుక్తశ్రమము వాయ నధివసించె. 23

సీ. అతఁడు ముహూర్త మి ట్లాసందిపై నుండి
తనముందు పీఁటపైఁ దనరుచున్న
పవమాననిర్మితవరపురాణగ్రంథ
మపుడు హస్తంబున నలవరించి
నవమషీమలినవర్ణముల దంతవ్రాత
కాంతిపూరంబులు గడుగుచుండ
ముఖసన్నిహితచతుర్ముఖపయోజాసనా
మంజీరశింజితమధుర మైన

గీ. కంఠరవమున గమకంబుగాఁ బఠించె
విమలగీతస్వరంబున వినెడువారి
చేతములు పల్లవింప నచేతనములు
చేతనత్వముఁ దాల్ప సంప్రీతి నప్డు. 24

చ. అపుడుపప్రమోదచిత్తులయియుండఁగ హర్షమండలా
ధిపునిగుణప్రశంస యొకతీరున మాటలవెంటఁ బుట్టినన్
విపులముగా విసంపలఁచి వేదవిదగ్రసరుల్ మహామతుల్
నిపుణులు సర్వశాస్త్రముల నిర్మలతేజులు బాణసోదరుల్

చ. నలుగురు పంకజాసనుని నాలుగు మోములఁ బోలువార లా
యలఘునృపాలమిత్రుని నిజాగ్రజునిం గని పల్కి రీధరా
వలయము నేలి చన్న జనవల్లభులం దొకఁడేని దోసముల్
గలుగనివాఁడు లేఁడుగద కంటను వత్తిని బెట్టిచూచినన్

సీ. ద్విజరాజు గురుపత్ని దెస దోస మొనరించె
నహుషుండు శచిఁ గోరి నాగ మయ్యె
బ్రాహ్మణి గ్రహియించి పతితుఁ డయ్యె యయాతి
సుద్యుమ్నుఁ డబలయై శోభఁ దఱిగెఁ
మార్గణవ్యసనియై మాంధాత యడుగంటెఁ
బృథు పుర్వి ధేనువు వెతలఁ బెట్టె
సౌదాసుఁ డగ్రజశాపాభిహతుఁ డయ్యె
దశరథుం డబలకై తనువు విడిచె
గీ. కార్తవీర్యుఁడు విప్రుల గాసిఁబెట్టె
శంతనుఁడు వాహినిని వీడి చింత నొందెఁ
బాండుభూనాథుఁ డడవిలోపల గతించె
ధర్మపుత్త్రుఁడు పోర సత్యంబుఁ దప్పె. 27

గీ. కాన రాజత్వ మపకళంకంబు గాదు
హర్షపరమేశ్వరుఁడు మాత్ర మఖిలసుగుణ
పుంజముల కాలవాలమై పూజ్యుఁ డయ్యె
మాకు వినిపింపు మారాజుమాన్యచరిత. 28

సీ. పక్షపాతముతోడఁ బైకొను భూభృత్కు-
లావళి నిలిపె నీహరిహాయుండు
సింధురాజు మథించి సిరికరంబును బట్టి
యుద్వాంగె నీపురుషోత్తముండు
వరహస్తమున వైరివక్షంబు దునిమి వి
జృంభించె నీనరసింహమూర్తి
ఏకాస్త్రహతి రిపుహృదయం బగల్చి సం
స్తవనీయుఁ డయ్యె నీశక్తిధరుఁడు
గీ. అనుచు నీరాజుకథ విస్మయావహముగ
నార్యులు వచింప వినుచుంటి మచ్చటచట
హర్షవర్థక మైనయీహర్షచరిత
మఖిల మెఱిఁగింపు మాకు మహాకవీంద్ర! 29

చ. అనఁ జిఱునవ్వునవ్వి యహహా! భవదీయకుతూహలంబు దీ
ర్చను నిల శక్తుఁడెవ్వఁడు ధరావిభుసద్గుణకీర్తనంబు శే
షునకయినన్ దరంబగునె? చొప్పడ విట్టితలంపు లున్న తా
వనిజఫలంబులం బడయ వామనుఁ గోరినచంద మయ్యెడున్.

గీ. పరమాణుసదృశ మగునీ
ధరణీసుతహృదయ మేడ, ధాత్రుస్తంభాం
తరపూర్ణ మైననరపతి
చరితం బది యేడ, తెలుప శక్యమె నాకున్? 31

మ. ధరణీనాథునివంశవృత్తము సవిస్తారంబుగాఁ దెల్ప దు
స్తర మట్లౌటఁ ద దేకదేశకథ నాస్వాదింపఁగాఁ గోరిన
గురుసేవాధిగతాస్మదీయకవితాంకూరంబు పుష్పింపదే
సరసుల్ మీరు నరేంద్రవంశకథ భాష్యం బెట్టిపుణ్యంబొకో!

వ. అను నవసరంబున దివసంబు పరిణతప్రాయంబగుటయు.

చ. అరుణమయూఖపాటలజటాంకురపల్లవితోత్తమాంగుఁడై
యురుతరసాంధ్యరాగరుధిరోగ్రశమంతకపంచకంబునన్
ఖరకరజామదగ్న్యుఁ డరిఘస్మరుఁడై పితృతర్పణక్రియా
పరతఁ బ్రశాంతుఁడై పొలిచెఁ బశ్చిమసాంధ్యయుగద్వ
[యావధిన్. 34

గీ. బాణుఁ డనుజన్ములను గాంచి భానుఁ డిప్పు
డపరగిరికూటములు సేర నరుగుచుండెఁ
జరమసంధ్యాభివందనసమయ మయ్యెఁ
బార్థివేంద్రునికథ లెల్లి పలుకువాఁడ. 35

గీ. అనుచు వారలయనుమతి నపుడ కదలి
శోణమున కేగి యచట విశుద్ధమతిని
సాంధ్యకృత్యము లాత్మీయజనులతోడ
సలిపి బాణుండు నిజనివాసంబు సేరె. 36

వ. తత్సమయంబున 37

మ. కలికాలోత్కటపాపసంచయములన్ ఖండించి నైతానిక
జ్వలనప్రోద్గతధూమ మంబరమునన్ వ్యాపింప సంధ్యార్చనాం
జలిబద్ధద్విజలోకరమ్యమయి తత్సాయాహ్న మొప్పారె గో
కులపాలప్రవిముక్తవత్సకలితక్రోడోల్లసద్ధేనువై. 38

సీ. బ్రహ్మనసస్థులై పరతత్త్వచింతలో
మునిఁగి మైమఱచినమునిగణంబు
ఆలముందర బాలయవసపూలక ముంచి
పాలు దీసెడుగోపబాలకులును
హరిణాజినధవిత్రహస్తులై నైతాన
వీతిహోత్రుని గొల్చువిప్రసతులు
స్థవిరోపదిష్టమై చరమసంధ్యోపాస్తి
సలుపునూతనవర్ణిసముదయంబు
గీ. గలిగి చెలువొందురజనీముఖంబునందుఁ
బ్రథమయామంబు విద్యాప్రపంచగోష్ఠిఁ
గడపి సోదరగృహగతకమ్రశయన
తలము సేవించె రాత్రి నిస్తంద్రుఁ డగుచు. 39

గీ. ఎల్లవారును హర్షరాజేంద్రచరిత
మెల్లి వినఁగోరి మనముల నల్లిబిల్లి
గొనెడుతమకంబు పెంపునఁ గూర్కు రాక
శయనముల నుండఁ గల్పమై చనియె రాత్రి. 40

గీ. అరుణుఁ డుదయింప సాంధ్యకృత్యములు దీర్చి
బాణుఁ డున్నంత హర్షభూవరునిచరిత
మాలకింపఁగ బాంధవు లరుగుదేఱఁ
బలికె నాతఁడు విస్ఫుటఫణితి నపుడు. 41

—* క థా ప్రా రం భ ము *—

సీ. సకలసస్యాంకురశ్యామలకాశ్యపీ
కలితాగ్రహారోపకంఠభూమి
సర్వర్తుఫలపుష్పసంభరితారామ
తరుతిరస్కృతభానుకిరణచయము
కైలాసశైలానుకారిగోధవళిత
ప్రాంతకాంతారశాద్వలతలంబు
వివిధాధ్వరప్రీతవీతిహోత్రసముత్థి
తాజ్యగంధిలధూమితాంబరంబు
గీ. మధురజలపూర్ణకాసారమధ్యగతస
హాస్రపత్రోపవిష్టభల్లాతుకులము
సర్వసంపద్విభూతనిర్జరపురంబు
పరిఢవిల్లును శ్రీకంఠపట్టణంబు. 42

వ. మఱియు నప్పురవరంబున. 43

సీ. క్రతుధూమజాతాశ్రుతతిఁ గడిగినయట్లు
లచటఁ గుత్సితదృష్టు లంతరించె
యూపదారుచ్ఛేదనోపయోగికుఠార
ధారలఁ దెగిన ట్లధర్మ మడఁగె
దీయమానానేకధేనువిషాణాగ్ర
ఖండితుఁ డైనట్లు కలి నశించె
శ్రుతినాదవిదళితశ్రోత్రంబు లైనట్లు
లీతిబాధలు వోయె భీతిఁ గలఁగి
గీ. అన్నసత్రసహస్రమహానసాగ్ని
తాపమునఁబోలె రోగముల్ రూపుమాసె
నృపవివాహసమాహతవిపులపటహ
రావముల కోడిన ట్లుపద్రవము లణఁగె. 44

సీ. మునులపాలిటితపోవనము రూపాజీవ
హరిణేక్షణలకుఁ గామాయతనము
శత్రులోకముపాలిశమనుని కేతనం
బర్థుల కెల్లఁ జింతాశ్మరత్న
మగ్రజన్ములపాలియక్షేశ్వరావాస
మాటకత్తెలకు నాట్యాలయంబు
శస్త్రోపజీవులసాముగరిడిసాల
గంధర్వనగరంబు గాయకులకుఁ

గీ. దరుణవిద్యార్థిజనములగురుకులంబు
భవ్యశరణాగతులవజ్రపంజరంబు
అఖిలభిక్షులపాలిశాక్యాశ్రమంబు
పరఁగు స్థాణ్వీశ్వరం బనుపట్టణంబు. 45

సీ. లావణ్యవతులసంల్లాపమాధుర్యంబు
మాతంగగమనలమాన్యచరిత
విభవానురక్తలవిఖ్యాతభవభక్తి
గర్భదరిద్రులకలిమిబలిమి
చక్కనిపువుఁబోండ్లచంద్రకాంతశరీర
మప్రమత్తలమదిరానురక్తి
అతివిశుద్ధద్విజాస్యలయాసవామోద
మబ్జవక్త్రలకళంకానవాప్తి
గీ. జిహ్మగాలకముఖులయజిహ్మగతయు
హరిణనేత్రలపుండరీకాస్యములును
శూన్యమధ్యలవక్షోజసుస్థిరతయుఁ
జూడ నొప్పును దత్పురీసుదతులందు. 46

చ. సురుచిరనేత్రకోణములసొంపులె మౌళికిఁ గల్వదండలై
పరఁగుట నుత్పలంబు లతిభారములయ్యెను గుంతలంబు లా
తరుణులగండదర్పణగతప్రతిబింబములై తమాలికా
ఘనరుచిరావతంసవిభవంబులడంబు లడంచి మించెడున్. 47

సీ. ఊర్పు వాసనలకై యొలయు తేటులె చాలు
మున్ఁగు లీలువుటాండ్రిమురిపెమునకె
వాణీవిలసనంబె వీణానురణనంబు
కిన్నరల్ పైపై నివన్నియలకె
అందెలరవళితో నరుగునంచలె చాలు
నకియలబలఁగ మైశ్వర్యమునకె
పరిమళహాసంబె పటవాసచూర్ణంబు
గంబురాపొళ్ళు విడంబనములె
గీ. అధరములకెంపె నెమ్మోని కంగరాగ
మడుగుఁదమ్ముల వ్రాలినయళికులములె
నీలమణినూపురంబు లాపోలినతుల
సొంపు, తొడవులఁ దొడుగక యింపు నింపు. 48
మ. అట వర్ణాశ్రమధర్మరక్షణపటిష్ఠాక్షీణకాంక్షేయక
స్ఫుటనవ్యేతరబాహుకండుఁడు వచస్స్ఫూర్తిస్ఫురండాహవో
త్కటశత్రుఘ్నుఁడుపుష్పభూతియనుగోత్రాపాలకుఁడొప్పది
క్తటనాగేంద్రకపోలనిర్మితజయాంకస్వర్ణవర్ణాఢ్యుఁడై. 49
గీ. పృథువు గోవును జేసె నీపృథివి ననుచు
మహిషిఁ దాఁ జేసె రాజన్యమాన్యుఁ డితఁడు
సార్వభౌములబుద్ధి నైసర్గికముగ
నిచ్చ వచ్చినతీవన యేగుఁగాదె. 50

క. అతనికి శైశవమాదిగ
నితరులయుపదేశ మించుకేనియు లే కా
శితికంఠభక్తి హృదయ
స్థితమై యనుదినము వృద్ధిఁ జెందుచు నుండెన్. 51

చ. అనుదిన మంబికావిభుని నర్చనసేయక యారగింపఁ డా
జనవిభుఁ డన్యదేవతలచాయను జూడఁ డనంగసంహరున్
మనమునఁ జింత సేయుఁ బురమర్దనునామము లుచ్చరించు శం
భుని నవపుష్పదామములఁ బూజితుఁ జేయునుభక్తియుక్తుఁడై

గీ. మహిని రాజానుమతమె ధర్మంబుగానఁ
బట్టణంబున నేవేళఁ బ్రమథనాథ
పూజనంబులఁ బొద్దులు పుచ్చుచుండి
రానరేశ్వరుధర్మరాజ్యంబునందు. 53

ఉ. ఆరమణీయపుణ్యవిషయంబుల గుగ్గులుధూపధూమసం
భారము లంగజారిపదపద్మసమర్పితబిల్వపల్లవో
దారకషాయగంధములు దర్పకభంజనలింగసేచన
క్షీరకణార్ద్రముల్ వొలయు శీతలపూతసమీరడింభముల్.

గీ. పాశుపతదీక్షితుం డగుపార్థివేంద్రు
మన్ననల నందఁగోరి సామంతమంత్రి
వర్గ మనుదిన మొసఁగు నుపాయనముగ
నభవపూజోపకరణపదార్థసమితి. 55

చ. కలధౌతాచలకూటసన్నిభమహాకాయంబులుం హాటకో
జ్జ్వలకోశాంచితశృంగముల్ గలబలీవర్దంబులం దెచ్చి భూ
తలనాథుం గని కానుకల్ లిచ్చిరి దిగంతక్ష్మాపతుల్ రుద్రపూ
జలసంధ్యాబలిసేవనార్థము గిరీశప్రీతిగా నిచ్చలుం. 56

సీ. చారురత్నాంచితస్నపనపాత్రి లొసంగి
భూనాథుమన్ననల్ పొందువారు
భర్మనిర్మితధూపభాజనంబులు వెట్టి
పార్థివుచిత్తంబుఁ బడయువారు
మణిదీపదండముల్ మనుజేశ్వరున కిచ్చి
యధికసమ్మానంబు లందువారు
మాణిక్యముఖకోశమండనంబు లొసంగి
యవనీశుమెప్పులఁ నందువారు

గీ. బిల్వఫలములతో భూతి వెట్టువారు
నగుచు సామంతమంత్రిమిత్త్రావనీశ
భూసురులు గొల్తు రేవేళ ముదముతోడఁ
బరమమాహేశ్వరుం డైనపార్థివేంద్రు. 57

క. ముమ్మనవాల్గాలుపు గే
హమ్ములు గంధోదకముల నలికియు సుమదా
మమ్ములు గట్టియు సంతిష
రమ్మన యుననములకుఁ బాణిర క్తిమ మొదవెఁ, 58

గీ. సకలవిద్యావిశేషగీష్పతి యనంగ
ఘనతపశ్శక్తి ఫాలలోచనుఁ డనంగఁ
బరమశైవుండు దక్షిణాపథనివాసి
జగతి నుతికెక్కె భైరవాచార్యుఁ డొకఁడు. 59

శా. యాతాయాతధరామరేంద్రులుతదీయానూనమహాత్మ్యవి
ఖ్యాతిం దెల్ప నఖండహర్షమునఁ దా నాలించి భూపాలుఁ డా
భూతేశుం డితఁడంచు నెమ్మనమునన్ బూజించు శీలైక్యమే
చేతఃప్రీతి ఘటించి దూరగతులం జేర్పున్ సమీపస్థలిన్.

మ. ధరణీనాయకుఁ డొక్కనాఁడు నిజశుద్ధాంతంబు నందుండ భా
స్కరుఁ డస్తాద్రికిఁ జేర వేత్రవతి భూకాంతున్ విలోకించి ప
స్కరియె వ్వాఁడొ యొకండు భైరవమహాచార్యాజ్ఞనే తెంచి దే
వరఁ జూడ న్మొగసాలనిల్చెనని తెల్పన్ సంభ్రమస్వాంతుఁడై

గీ. వేగ మాతని లోనఁ బ్రవేశపెట్టు
మనుచు భూపాలుఁ డాప్రతీహారి కాజ్ఞ
యొసఁగుటయుఁ బోయి దీర్ఘాంగు నున్నసాస్యుఁ
బృథుశిరోగ్రీవు నాయతపీనబాహు. 62

గీ. కక్షగతనారికేళభిక్షాకపాలు
వికటదంతాంకురోన్నతవిపులలపను
ధాతురంజితకర్పటోత్తరపటాంగుఁ
బురుషు నొక్కనిఁ గొనివచ్చి మ్రొక్కి నిలిచె. 63

క. అవనిపతి యుచితపీఠము
శివభాగవతున కొసంగి సేమమెకడ భై
రవగురుల కెచట విడిసిరి
శైవోత్తము లనుచు నడిగె సాదరమతియై. 64

క. భూరమణానుగ్రహసం
పేరితుండై యతండు పలికె విడిసిరి వారీ
యూర సరస్వతికడం గాం
తారమ్మున శూన్యదేవతానిలయమునన్. 65

క. అని మాత్రనంచి ముడిచిన
ఘనరాజతకమలపంచకంబులు పాయ
జ్జనవిభునకు దేశికుం డం
పెను దీవన లొసంగి యనుచు వేడుక నొసంగెన్. 66

మ. జనలోకేశుండు భైరవేశ్వరమనస్సంప్రీతికై యాయుపా
యనముం గైకొని శైవభక్తిఫల మాహా నేడు సిద్ధించె న
జ్జనవంద్యుండు జగద్గురుం డిచటికిన్ సంప్రీతి విచ్చేయుటన్
మునినాథోత్తమ! యెల్లి ప్రొద్దున నెయాపుణ్యాత్ము సేవించెదన్

క. అని జనపతి సన్యాసిని
మునిపాలికిఁ బంపి తాను ముదమున మఱునాఁ
డినుఁ డుదయింపఁగఁ గతిపయ
జనములు తనుఁ గొలువ ఛత్రచామరయుతుఁడై. 68

గీ. ధవళహయ మెక్కి సామంతధరణిపతులు
తోడ రా భైరవాచార్యుఁ జూడ నరిగె
వేయివెలుఁగులదొరను సేవింప నరుగు
తారకానాథుపగిది నాధరణివిభుఁడు. 69

సీ. ఆదిత్యుఁ డుదయాద్రి నధివసింపకమున్న
యఘమర్షణస్నాన మాచరించి
సావిత్రి జపియించి పావకు నర్చించి
యంచితపుండరీకాజినమున
నాత్మశిష్యులు గొల్వ నాసీనుఁడై మహా
పశుమాంసవిక్రియ ప్రాప్తమైన
వైద్యుతకపిలప్రభాపుంజసదృశమా
నైజతేజంబున నచటివారి
గీ. నాక్రమించి విహాపాత్రుఁ డనఁగ నొప్పు
భైరవాచార్యుఁ గాంచి యాపార్థివేంద్రుఁ
డంజలిని మౌళిఁ దాల్చి యాయనఘమూర్తి
కప్పు డభివాదనము సేసె నధికభక్తి. 70

సీ. కనకాద్రికైవడిఁ గల్పపాదపలస
త్పల్లవసుకుమారపాటలంబు
కైలాసగిరివోలెఁ గాత్యాయనీనాథ
పాదరజఃపూతపాండుశిరము

అంభోధికైవడి నఖిలమహానదీ
సలిలసంక్షాళితోజ్జ్వలతరంబు
గంగాప్రవాహంబుకైవడి బహుపుణ్య
తీర్థోదకస్నానదీపితంబు

గీ. ధర్మధామంబు కరుణానిధానకంబు
సత్యతీర్థంబు సౌజన్యనిత్యనిలయ
మైనయాభైరవాచార్య ననఘమూర్తిఁ
గాంచి విస్మితుఁడయ్యె భూకాంతుఁ డపుడు. 71

ఉ. భైరవదేశికుండు నరపాలుని దూరమునందె కాంచి యా
తారకరాజురాకఁ గని తద్దయుఁ బొంగుపయోధికైవడిన్
భూరిముదంబునం బొదలి ముందుగ శిష్యులు నిల్వ నిల్చి యా
ధీరున కిచ్చెఁ గానుకగఁ దీయనిబిల్వఫలంబు ప్రేమునన్. 72

గీ. జహ్నుమునికర్ణపథసముత్సార్యమాణ
దివిజగంగానదీపూరధీరనాద
సదృశరవమున స్వస్తివాచన మొనర్చె
నరపతియు దూరముననుండి నతి యొనర్చె. 73

క. జననాథున కాననముగఁ
దనశార్దూలాజినం బుదారతఁ జూపన్
గని భైరవగురునాదర
మున కెంతయు సంతసించి భూవరుఁ డనియెన్. 74

గీ. పూర్వరాజన్యభుక్తనిర్ముక్తమలిన
దుష్టరాజ్యరమాసంగదోషవశత
శైవదేశికవరుల కీజనునియందు
గురుతిరస్కారశంకను గూర్చె నేఁడు. 75

క. దూరగతుండనె నైన మ
నోరథశిష్యుండ గురుజనులయాసనముల్
భైరవదేశిక గురువుల
తీరున మాన్యంబు లగుట తెల్లము కాదే. 76

ఉ. కావున మీర లాసనముఁ గైకొనుఁడంచువచించునంతలో
సేవకు లొక్కచేలమును జెచ్చిరఁదెచ్చినఁ గూరుచుండె నా
భూవరుఁ డెల్లరున్ నికటభూతలమందె వసించి సంతశి
ష్యావళి దేశికోత్తమునియానతిఁ బూజితుఁ జేసె భూమిపున్

చ. వినయసమన్వితుండు భుజవీర్యసమగ్రుఁడు నైన తనర్చునా
జనపతిఁ జూచి భైరవుఁడు సంతసమంది నరేంద్ర! నీ కుపా
యనము నొసంగఁ గోర్కెగల దైనను నేమియొసంగనేర్తునీ
కనితరలభ్యభోగవిభవాస్పదమూర్తికిఁ జక్రవర్తికిన్? 78

మ. అనఘా! పుట్టినదాదివిత్తములపై హత్తింపఁ జిత్తంబు గాం
చనవికీర్ణితము గాని దేహమును భిక్షారక్షితప్రాణముల్
మునిసేవాధిగతాక్షరంబులు మహాభూతేశపాదాంబుజా
ర్చనలబ్ధ గూర్చినపుణ్యలేశమును నాసర్వస్వ మూర్వీశ్వరా!

గీ. వైభవోచితములు ప్రతిపత్తు లగుట
వీనిలో నేది వలయునో వేడ్కఁ గొనుము
ప్రతనుగుణగృహ్యములు పుష్పతతులువోలె
సజ్జనులమానసంబులు సార్వభౌమ ! 80

క. భూనాథ ! నీగుణంబులు
వేనోళ్లను జనులు వొగడ విని నినుఁ జూడన్
బూని యిట వచ్చి కాంచితి
మానస మానందజలధిమగ్నం బయ్యెన్. 81

వ. అనుటయు రాజేంద్రుండు వినయావనతుం డగుచు 82

ఉ. పావనమయ్యె నాకులము పార్థివ యెంతయువృద్ధిఁ బొందెస
ద్భావముతో గురూత్తములు తామిటవచ్చుటఁ జేసియంచు నా
త్మవరుఁ డిష్టగోష్ఠి గుణసన్నిధిఁ బెద్దయుఁ బ్రొద్దు నిల్పి యా
త్మావసథంబు సేరె నతఁ డాదర మొప్పఁగ వీడుకొల్పఁగన్.

ఉ. అంతట నొక్కనాఁడు గురుఁ డాసరనాథుని చెంత కేగ భూ
కాంతుఁ డఖండరాజ్యరమఁ గానుక వెట్టఁగ స్థైర్యాఢ్యుఁ డ
త్యంతముడంబునొందడి వసుధావర ! తాపసవృత్తిఁ బూని స
చ్చింత వనాంతరంబుల వసించెడు వారికి నేల రాజ్యముల్ ?

క. వనములఁ దపములు సలిపెడు
మునులకు నరనాథ ! విభవములకును యోగం

బనుచిత మగును భవాదృశ
జనములె పాత్రములు వానిసంగతిఁ బడయన్. 85

గీ. అనుచు నిష్టగోష్ఠి నతఁ డొకించుక సేపు
విభునికొలువునందు వేడ్కఁ గడపి
యధిపుఁ డనుప నరిగె నాత్మీయనిలయంబు
హర్షపూర్ణమానసాబ్జుఁ డగుచు. 86

ఉ. అంతట నొక్కనాఁడు ధవళాంబరసంవృతఖడ్గ మాత్మక
క్షాంతరసీమఁ బూని జటియై యొకమస్కరి వచ్చి దేవ! మీ
చెంతకుఁ బంపినాఁడు యతిశేఖరుఁ డియ్యది నిల్పుఁగాక ది
గ్దంతికఠోరతుండనిభకర్కశ మైనభవద్భుజంబునన్. 87

సీ. రాజేంద్ర! యిది బ్రహ్మరాక్షసుం డొక్కఁడు
ధరియించుదివ్యశస్త్రంబునమ్మ
భైరవాంతేవాసి పాతాళనాథుండు
హరియించె దీని నయ్యసురనుండి
అట్టహాసాఖ్య మియ్యసి భవద్భుజయోగ్య
మగునని దేశికుఁ డంపినాఁడు
గైకొనుం డని వస్త్రకవచంబు విడఁదీసి
ఖండితశరదభ్రమండలంబు
కరణి వెల్గెడుదానిఁ గాలమృత్యుకరాళ
జిహ్వికాభీలమై చెలఁగుదానిఁ

బ్రిళయ భైరవరోష పావకోద్గతనీల
ధూమాంకురచ్ఛాయఁ దోరయుదానిఁ
బ్రాణికోటుల మ్రింగఁ బాథోధిఁ బుట్టిన
కాలకూటముఁవోలెఁ గ్రాలుదాని
జళిపింపఁ బవనసంస్పర్శ మోర్వఁగలేక
వాఁడిమై మొరసెడువాయిదాని

గీ. ఖడ్గరూపముఁ దాల్చినకాళియాహి
పగిది నతితీక్ష్ణతర మైనపటుకృపాణ
మామహీశున కొసఁగిన నధికభక్తి
నతఁడు గైకొని నిజపాణి నలవరించె. 88

గీ. పరులసొమ్మున కొకనాఁడు పాలుపడదు
పాణిపుట మట్టులైనను భైరవాఖ్య
నాసతిని మీఱలేక నే నందుకొంటి
భక్తితో నని గురులతోఁ బలుకు మయ్యె. 89

క. అని భువనావనదీక్షా
ఘనదక్షిణశక్తిహస్తకమలముసందున్
జనవిభుఁడు దాల్చి సకలా
వనిచక్రము పాణిపాఠఫలమని తలఁచెన్. 90

గీ. రాజు దీవించి యాపరివ్రాజకుండు
శైవదేశికుచెంతకుఁ జక్క నరిగె

అంత నొకకొన్నిదివసంబు లరుగ భైర
వార్యుఁ డారాజుసన్నిధి కరుగుదెంచి. 91

వ. ఏకాంతంబున నతని కిట్లనియె. 92

గీ. అలసు లాత్మార్థములఁ బరార్థైకనిరతు
లుత్తములు గాన మీవంటియుర్వీపతుల
కర్థిజనలాభ ముత్సవం బగుట యెఱిఁగి
వేఁడ వచ్చితి నిన్ను సద్వినుతచరిత! 93

క. యాచకజనులకు దైవత
నైచికివని యెఱిఁగి నిన్ను నరనాయక! సం
కోచము లేకయ వచ్చితి
యాచింపఁగ విను మదీయయాచ్ఞార్థంబున్. 94

సీ. అసితాంబరానులేపాకల్పమున నేను
జపియించినాఁడ శ్మశానసీమఁ
గల్పోక్తవిధి మహాకాళమంత్రము కోటి
పర్యాయము లఖండభక్తితోడ
వేతాలసాధనావిధియె తత్సంసిద్ధి
యనువుగా దటి సహాయంబు లేక
దిగిభశుండాదండదీర్ఘమై యొప్పారు
భవదీయదక్షిణబాహుదండ

గీ. మట్టహాసముతోడ యామ్యాభిధాన
దిక్తటార్గళ మొకనిశీథినికి నైనఁ
గలుగ తక్కినదిక్కులు గాఁపుసేయు
ముప్వ రాత్రిమయశిష్యులు పూర్ణబలులు. 95

గీ. బ్రహ్మరక్షఃకృపాణసంపాది యైన
నాదుశిష్యులందు పాతాళనాథుఁ డొకఁడు
బాలమిత్రులందు టిటిభప్రవరుఁ డొకఁడు
ద్రవిడధార్మికుఁ డనుకర్మఠాత్ముఁ డొకఁడు. 96

ఉ. నావుడు సంతసించి నరనాయకుఁ డిట్లను దేశికేంద్ర! స
ద్భావముతోడ శిష్యజనవర్గమునన్ ననుఁగూడఁ జేర్చి మీ
రీవిధి నానతిచ్చుట మదీప్సితముల్ తుదిఁ దాఁకుటయ్యె భూ
దేవకులావతంస! భవదీయకృపన్ నెరవేర్తుఁ గార్యమున్.

వ. అనిన ముదితాంతరంగుండై భైరవాచార్యుం డిట్లనియె.

గీ. వచ్చుకృష్ణచతుర్దశీవాసరమున
నర్ధరాత్రంబునందు మహాశ్మశాన
సవిధశూన్యాలయమున శత్త్రుద్వితీయ
మూర్తినై చూచెదవుగాక భూప! మమ్ము. 99

గీ. సమయ మిట్లొనరించి యాచార్యుఁ డరిగె
జనవిభుండును నియమితదినమునందు

శైవవిధిదీక్షితుం డయి చండమండ
లాగ్రమున కధివాసధూపార్చ లిచ్చి. 100

క. సాంతఃపురముగఁ బరిజన
మంతయు వంచించి యాత్రియామార్ధమునన్
సుంతయు భీతిల్లక భూ
కాంతుఁడు కరవాలకలితకరుఁడై యరిగెన్. 101

వ. ఇట్లరిగి మహాశ్మశానసవిధశూన్యాయతనంబు సేరునంతకు

చ. కృపకృతవర్ములున్ సమరకేళివిశారదుఁడైనద్రౌణియున్
సపరికరప్రచండులయి సౌప్తికవేళ మహోగ్రశత్రుమం
డపమున కేగురీతి నరనాయకుఁ గానఁగవచ్చి రుల్లస
ద్విపులకృపాణపాణులయి వీరులు భైరవశిష్యు లత్తఱిన్.

ఉ. వారల మీర లెవ్వరని వార్షికమేఘరవంబునన్ మహీ
ధారుఁడు హెచ్చరింప నభిధానములన్ వెలిఁబుచ్చి రంత న
వ్వీరవరత్రయంబు తనవెంటఁ ద్రిమూర్తులవోలె రాఁగ నా
భూరమణుండు వోయె గురుపుంగవుసాధనభూమిచెంతకున్.

క. రక్షోసర్క్షపదాహవి
రూక్షానిలఘోరమైనరుద్రక్షోణిన్
దీక్షితుఁ డయి కూర్చుండిన
దక్షాధ్వరదమనుఁ డనఁగఁ దగియెడువానిన్. 105

సీ. భస్మనిర్మితమహాపద్మమండలమునఁ
జండాంశుకై వడి మండువాని
మథ్యమానక్షీరమహితార్ణవంబునఁ
దరిగొండకై వడిఁ దనరువాని
రక్తచందనమాల్యరంజితం బగునొక్క
నరశవోరఃపీఠిఁ గరిమతోడఁ
గూర్చుండి తన్ముఖకుహరనిర్యద్వహ్ని
వెల్గుచుండెడువాని వికటవేషు
గీ. కృష్ణమాల్యానులేపనుఁ గృష్ణవసనుఁ
గృష్ణపటనిర్మితోష్ణీషుఁ గృష్ణసూత్రుఁ
గృష్ణతిలముష్టివర్ధితకృష్ణవర్త్మ
భైరవాచార్యుఁ గాంచె నాపార్థివుండు. 107

చ. నరవిభుఁ డంత మ్రొక్కి యభినందితుఁడై చటులాట్టహాసభీ
కరభుజదండ ముగ్రరిపుసుస్మరకర్కశకాలదండమై
పరగఁ బరేతరాజపరిపాలితదిక్తట మాక్రమించి సు
స్థిరుఁడయినిల్చెఁ బ్రాణులనుదీర్ణతమిస్రంగులయాంతకుండనన్
గీ. అరిగెఁ బాతాళనాథుఁ డైంద్రాశఁ గావఁ
గర్ణతాళుండు ధనదాశఁ గావ నరిగె
టిటిభకుం డపరాశ నిలిచె
భైరవుండును నిజకార్యపరత నుండె. 108

సీ. భైరవుం డిట్లు దిక్పాలబాహాప్ర
గుప్తి నిశ్చింతుఁడై ఘోరకర్మ
సాధింపఁ గాణపశతము లుద్ధతవృత్తి
విఘ్నంబు సేయంగ వివిధగతుల
విఫలప్రయత్నముల్ వేనవే లాచరించి
శాంతించె రాత్రియు సగము గడచె
నపుడు మండలమున కనతిదూరంబునఁ
గౌబేరదిక్తటప్రాంతలమునఁ

గీ. బ్రళయసమయవరాహదంష్ట్రావిదీర్ణ
మైనకైవడి వివరంబు గానవచ్చె
నమ్మహాగర్తముననుండి యపుడు వెడలెఁ
బురుషుఁ డొకఁ డున్నతాంసుండు భూరిబలుఁడు.

సీ. ఆశామదేభేంద్రహస్తాగ్రసంక్షిప్త
కాలాయసాలానకాండ మనఁగ
గంభీరపాతాళగర్తసమాయాత
బలిమహాసురసార్వభౌముఁ డనఁగ
నుపరివిన్యస్తదీపోపలక్షితమహేం
ద్రాశ్మనిర్మితచలద్ధర్మ్య మనఁగఁ
గపటసూకరవజ్రకఠినదంష్ట్రాటంక
హతిఁ బలాయితహిరణ్యాక్షుఁ డనఁగ.

గీ. నవని జనియించు నరకదానవుఁ డనంగ
దూపు గైకొన్న యామ్యప్రతాప మనఁగఁ
బ్రళయకాలోగ్రభయదవిగ్రహ మనంగ
నిలిచె నొక్కఁడు కువలయనీలమూర్తి. 110

చ. కరముల మృత్తికన్ జిదిమి గంధగజేంద్రకఠోరతుండపీ
వరవిపులాంసపీఠములఁ బ్రాముచు వార్షికమేఘనాదమే
దురరభసాట్టహాస మరిదోర్బలముల్ గుదియింప మత్తసిం
ధురగమనప్రకారమున దుర్దముఁడై యరుదెంచి యిట్లనున్

స్రగ్ధర. ఏరా విప్రాధమా! న న్నెఱుఁగవె యురగా
ధీశు శ్రీకంఠనాగున్
ధీరున్ నాపేరఁగాదే తెలియఁగఁబడు నీ
దేశ మోమూర్ఖ! విద్యా
పారంబుల్ గాంతు వోరీ బలి యొసఁగక యో
బాలిశా! నాకుఁ గూల్తున్
ఘోరాజిన్ నీకుఁ దోడ్తో కుటిలమతుల నీ
క్షుద్రులన్ క్షోణిపాలున్ 112

గీ. అనుచు నుత్ఖాతఖడ్గుఁడై యాగ్రహమున
వచ్చుఁ గీటిభముఖ్యులవజ్రికరిన
కూర్పరాహతి నుర్వరఁ గూలఁ ద్రోచి
నవవిభూషణ రశ్మిముఖముగా నడచె నతఁడు. 113

ఉ. అశ్శ్రుతపూర్వరోషపరుషాక్షరముల్ విని సాట్టహాసుఁడై
విశ్శ్రుతపౌరుషుండు హరివిక్రముఁ డాధరణీశుఁ డోరి ని
న్నశ్శ్రమలీలఁ ద్రుంతునని, యాయుధమున్ గొనిరమ్మటంచుఁ జ
క్షుశ్శ్రవనాథుపైఁ గవిసెఁ గోకనదారుణచారునేత్రుఁడై.

క. సాయుధయోధవరానే
కాయోధనశిక్షితాస్మదాయతఖడ్గం
బేయఁగ రోయునిరాయుధు
నాయితమయి రమ్ము మారుతాశన ! యనికిన్. 115

వ. అనినఁ గాకోదరుం డిట్లనియె. 116

ఉ. ఆయుధమేల ? యాయసమహాపరిఘప్రతిమాస్మదీయబా
హాయుగమధ్యవర్తియయి యూలయకాలుఁడుఁ వోవలేఁడురా
జా! యొకమర్త్యమాత్రునకు శస్త్రములేల దిగంతదంతితుం
డాయతబాహుదండముల నస్థులు పిండియొనర్తు రమ్మిటన్.

వ. అనుటయు, ధర్మయుద్ధప్రవీణుం డగునానరపాలుండు
సచర్మఫలకంబుగా నట్టహాసంబు విసర్జించి. 118

గీ. ధారుణీశ్వరుఁ డప్పు డర్ధోరుకంబు
పయిని గత్త్యను బంధించి బాహుయుద్ధ
మునకుఁ గడఁగినఁ బటుదీర్ఘభుజులు వారు
సలిపిరి రణంబు వృత్రవాసవులభంగి. 119

సీ. పరిఘాయతకఠోరబాహుకండాస్ఫాల
నారావముఖరదిగంతరంబు
వజ్రకఠోరకూర్పరఘాతపిండీకృ
తాన్యోన్యసంధిబంధాస్థిచయము
జానుప్రహారజర్జరితాంగనిర్గత
క్షతజరంజితరణక్ష్మాతలంబు
కఠినోగ్రహుంకారగంభీరరవదారి
తాష్టదిక్కరటికర్ణాంతరంబు
గీ. పరిఘవిక్షౌ రణం బతిభయద మగుచు
నర్ధరాత్రంబునందు మహాశ్మశాన
భూమి భైరవదేశికుపూన్కిఁ దీర్ప
దండశూకేంద్రుతోడ నాధరణిపతికి. 120

చ. ఇరువురు నిట్లుఘోర ధరణీశ్వరు బాహుబలంబు తోడుతోఁ
బెనుగఁగఁజొచ్చినన్ నృపతి భీమబలంబున వానిఁ గూల్చి భీ
కరకరవాలమున్ బెరికి కంఠము ద్రుంపఁదలంచునంతలో
నురగుని మేన జన్నిదములుండుటఁ గాంచియొకింత గొంకుచున్

గీ. విప్రుఁ డనుబుద్ధి నాతని విడిచిపుచ్చె
నంతలోఁ బండువెన్నెల లలమికొనియె
శారదాంభోజగంధముల్ చవులఁ బర్వె
రత్నమంజీరశింజితరవము సెలఁగె. 122

వ. అంత. 123

చ. కరకలితాట్టహాసమునఁ గానఁగనయ్యెఁ బయోదగర్భవి
స్ఫురదురుచంచలాలతికపోలిక నొక్కమనోజ్ఞమూర్తి భా
సురధవళాబ్జదామపరిశోభితకంధర పద్మహస్త ది
క్కరటికఠోరకుంభనిభకమ్రపయోధర దుర్నిరీక్ష్యయై.

క. ధరణీతలడోలాయిత
వరతులసీదామసౌరభగ్రహణేందిం
దిరముఖరితాఖిలాశా
న్తరమై యాదేవి నిలువ నరపతి ప్రీతిన్. 125

గీ. దేవి! యెవ్వతె వీవు నీదివ్యమూర్తి
యేల సాక్షాత్కరించె నాయెదుట నేఁడు
తెలుపు మని వేఁడఁ బలికె నాదివ్యవనిత
మత్తకలహంసగద్గదమధురఫణితి. 126

క. నారాయణవక్షఃస్థల
మేరామవిహారసౌధ మేదేవికి నా
క్షీరాబ్ధి పుట్టినిల్లా
శ్రీరామనుగా నెఱుంగు జిష్ణుఁడ! నన్నున్. 127

మ. నెలవుల్ నా కురుమండలాగ్రలతికానీరంధ్రకాంతారముల్
జలకక్రీడల కాటపట్లు సుభటాస్త్రవ్రాతనిష్పిష్టగా

త్రిలవాస్పృగ్ధ్వరపూర్ణసంగరమహారంగంబు లోవీర ! నీ
బలశౌర్యంబులు మెచ్చితిన్వరములంబ్రార్థింపుమాయిచ్చెదన్

క. అని దేవి నొడువుటయు నా
జనపతి భైరవునికార్యసంసిద్ధియ గో
రిన నాతనిగురుభక్తికి
మనమున నంప్రీతి యగుచు మాసతి పలికెన్. 129

గీ. జగతి భవదీయవంశ మాచంద్రతార
కముగ వర్ధిల్లుఁగాక యఖండశౌర్య
ధైర్యసాహసవిక్రమౌదార్యమతుల
కాకరం బయి పూజ్యత నందుఁగాత. 130

మ. సకలద్వీపనిఖాతదీప్రవిజయస్తంభుండు సామంతరా
ణ్మకుటానర్ఘమణిప్రభాపటలకల్మాషాంఘ్రిపద్ముండు రా
జకులాంభోధిసుధాంశుఁడొక్కరుఁడుహర్షప్రస్ఫుటాభిఖ్యనీ
యకలంకాన్వయమందుఁబుట్టుహరిదంతాక్రాంతసత్కీర్తియై

గీ. కమలమును వీడి యీచేయి కనకదండ
చామరముఁ దాల్చి యారాజచంద్రుపజ్జ
నిలిచి వీవోపు లీయఁగాఁగలదటంచుఁ
దెలిపి యారాజ్యలక్ష్మి యదృశ్య యయ్యె. 132

క. దేవినాక్యంబున నా
భూవిభుఁ డతిముదమునొందెఁ బూజ్యుం డగునా

శైవోత్తముఁడును నిష్ఠ
గావించినతపము సిద్ధిఁగనుటయు నంతన్. 133

ఉ. చారుచిరత్నరత్నరుచిజాలజటాలకిరీటవజ్రకే
యూరసువర్ణకుండలమహోజ్జ్వలభూషణభూషితాంగుఁడై
భూరిగదాకృపాణపరిపూర్ణభుజద్వయుఁడై మనోహరా
కారముతోడ భైరవుఁడు గైకొనె దివ్యశరీర ముద్ధతిన్.

గీ. ఇట్లు విద్యాధరత్వంబు నింపుమీఱఁ
దాల్చి శైవోత్తముండు భూధారుఁ గాంచి
వత్స! భవదీయదృఢబాహువపరిగుప్తి
సిద్ధిఁ బొందితి నిపుడు నిశ్చింత నేను. 135

గీ. అట్లుగావున నరనాథ! యాత్మశక్తి
కనుగుణం బగునుపకార మాచరించి
ధన్యతను గాంతు ననిన నాధరణివిభుఁడు
వినయమున భైరవున కిట్లు విన్నవించె. 136

క. భవదీయకార్యసిద్ధిని
నవనీసురముఖ్య! నేఁ గృతార్థుఁడ నైతిన్
బ్రవిమలపుణ్యోపార్జిత
భువనంబుల కేగుఁ డనిన భూసురుఁ డనియెన్. 137

సీ. అరుగుచున్నాఁడ నే నని వచియింతునా
యది స్నేహసదృశవాక్యంబు గాదు

అనువులు నీదుసా మ్మని వచియింతునా
యది పునరు క్తిదోషాస్పదంబు
ఉర్వీశ! నిర్హేతుకోపకారి వటంచు
వచియింతునా యనువాద మగును
బాంధవుండ వటంచుఁ బలుకుదు నంటినా
యది దూరమొనరించు టగునఁజుమ్మ

గీ. అధిప! మఱవకు న న్నను టాజ్ఞ యగును
గాన మీారు కృతఘ్నులఁ గపటమతుల
స్వార్థపరులను స్మరియించునసమయమందు
నన్నుఁ గూడఁ దలంపుఁ డనాదరమున. 138

క. అని టిటిభముఖ్యులఁ దా
ననురాగరసపరిపూర్ణ మగుదృష్టిఁ గనుం
గొని వారి నిండుకౌఁగిట
మునివర్యుఁడు సేర్చి వారిముదలఁ గొనుచున్. 139

క. తారాపథమున కెగసె ను
దారతఁ దలపూవు లగుచుఁ దారలు తనరన్
భూరిజవత్రుటితశాఖల
హారమణిప్రకరశబలితాశాంతరుఁడై. 140

ఆ. అతఁ డాత్మసిద్ధి కనురూపమైన చను
పుణ్యలోకములకుఁ బోవుటయును

బార్థివేంద్రుఁ గాంచి పలికె శ్రీకంఠాభి
ధానుఁ డైననాగతల్లజుండు. 141

గీ. భవదుదారభుజాబలప్రాభవమునఁ
గ్రితదాసుఁడ నైతి సద్వ్రతలేశ !
కార్యఖడ్గములం దనుగ్రహముతోడఁ
బనిగొనుము నన్ను నిదియ నాప్రార్థనంబు. 142

క. అని భూనాథునిముదలం
గొని యాభూవివరమం దకుంఠితగతి నా
జనుఁడు రసాతలమునకుం
జనె నంతటఁ దెల్లవారుసమయం బయ్యెన్. 143

చ. అల వనదేవతాస్తనతటాంశుకముల్ హరియించి ఘర్మసం
కలితశరీరుఁ డైనగతి గంధవహుండు తుషారబిందుశీ
తలుఁడయి తత్క్షణోన్మిషితతామరసోదరనిర్వమత్పరీ
మళవహనాతిభారమున మందగతి న్మెలఁగెన్ వనస్థలిన్.

మ. విరహోద్విగ్నరథాంగవక్త్రపవనావిర్భూతతాపంబు దు
స్తరమైనం జనెఁ బశ్చిమాబ్ధి కనఁగా జారెన్ దమఃపుంజముల్
ఉరువేగోత్పతదర్కవాహముఖవాతోద్ధూతమైనట్లు భా
స్వరతారాగ్రహమండలం బపరదిగ్భాగంబుఁ జేరెన్ వెసన్.

సీ. అవనికి డిగినయయ్యరవిందవాసినిఁ
గాంచనో యన విచ్చెఁ గమలవనము

వాయువశంబున వనలతల్ నీహార
కణముల రాల్చె నుత్కలికలట్లు
తెమ్మెరల్ చిమ్మినదివ్యపుష్పములవు
ప్పొళ్ళ బ్రుంగినయట్లు పొలుపుదఱిఁగి
సప్తర్షిగణము ధూసరితమై మందరా
హార్యకూటంబుల నస్తమిల్లె

గీ. జలజహస్తకు నిద్దురఁ దెలుపువేళ
మొరయుశంఖంబులో యన ముడుచుకొనెడు
కుముదములు వొల్చె నంతర్నిగూఢమధుక
రారవమనోహరములు జలాశయముల. 146

క. చవుదంతియంకుసం బన
దివిఁ బొల్చెను మృగశిరంబు తేజం బెడలన్
రవి యుదయింపక పూర్వమె
యవిరళముగఁ జెలఁగె దెసల నండజసతముల్. 147

వ. అట్టి ప్రభాతసమయంబున. 148

క, వనవాపీసలిలంబుల
జననాథుఁడు నాగయుద్ధసమ్మార్గమునన్
ఘనసైన్యాళిధూసరిత మగు
ననవృక్ష గణిగొని కరతాడనములతోన్. 149

ఆ. నగరమునకు వచ్చి నరనాథుఁ డంతట
వారిఁ దగినరీతి గారవించె
మునియుఁ గొన్నినాళ్ళు జనవిభుకడ నుండి
చనియె వనికిఁ దపము సలుపఁబూని. 150

శా. పాతాళేశుఁడు కర్ణతాళుఁడును దోఃపాండిత్య మేపార ను
త్ఖాతప్రస్ఫుటమండలాగ్రులయి యుద్ధక్షోణులన్ శత్రుసం
ఘాతంబుల్ బెగడొంద విక్రమకళాకౌశల్యముల్ సూపుచున్
బ్రీతిన్ భూపతిఁ గొల్చియుండిరి నిజాభీష్టార్థసంపన్నులై.

ఉ. భైరవదేశికోత్తమునివైభవమున్ వినఁగోరి రాజకం
ఠీరవుఁ డిష్టగోష్ఠుల మనీషులు గొల్వఁగనుండి వేఁడ నా
వీరులు కర్ణపేయములు విస్మయసంజనకంబులైనయా
ధీరునివర్తనంబులను దెల్పుదు రావిభుఁ డిచ్చ మెచ్చఁగన్.

గీ. శైశవోదంతముల వసుధేశుతోడ
ముచ్చటించుచుఁ బెక్కేండ్లు పుడమిఱేని
కొల్వులో నుండి విభునితోఁగూడ వారు
ఘనజరాభారసంక్రాంతకాయులైరి. 153

మ. కులిశాభీలశరప్రదారితకపిక్షోణీధరోరస్థ్సలా !
స్థలలాంఛార్థితవార్ధిశేఖర ! ఖరోదగ్రాంహిపక్షీశ ! యీ
శలసచ్చాపనవేక్షుఖండనకకీశా ! యీశముఖ్యార్చితో
జ్జ్వలపాదాంబుజ! అంబుజాసనసురేశస్తూయమానోదయా !

క. కటురటదటనీటంకృతి
చటులజ్యారౌద్రచాపచండాశుగవి
స్ఫుటితసుబాహూరస్థ్సల
జటిమఖరతుక ! ధరాత్మజాప్రియ ! రామా ! 155

తరళము. స్వరుకఠోరనఖాగ్రఖండితభర్మకశ్యపహృత్తటా !
ఖరకటాక్షసముత్కటా ! ఘనగర్వదుర్ఘసటాచ్ఛటా !
నరమృగేంద్రసమగ్రభీషణనాదపాటితదిక్తటా !
పరమభక్తసురారిడింభకపాలకా ! కుటిలాలకా !

—♦ గద్యము. ♦—

ఇది శ్రీకొమాండూరు కృష్ణమాచార్యప్రణీతం బయిన
యాంధ్ర హర్ష చరిత్రం బను మహాప్రబంధంబునందుఁ
బుష్పభూతివర్ణనం బనునది
తృతీయాశ్వాసము.

శ్రీయజ్ఞపతయే నమః

# ఆంధ్రహర్షచరిత

## చతుర్థాశ్వాసము




ధర ! గోపవధూమధు
రాధరపీయూషరసిక ! యదువంశమణీ !
సాధితనిజగురుపుత్రా !
రాధావదనాబ్జమధుకరా ! మధుమథనా ! 1

గీ. కలలనైనను యోగంబు గలుగ దెపుడు
కరము గ్రహియింప రైనను గరిమతోడ
నుత్తములు నామమాత్రాన నుర్విపతికిఁ
బతు లటంచును బ్రఖ్యాతిఁ బడయఁగలరు. 2

గీ. దంతిముఖువక్త్రమునఁ బుట్టుదంతమట్లు
విపులనృపవంశములనైన విభుఁ డొకండ
సర్వభూభృత్ప్రకంపనశౌర్యసారుఁ
డుద్భవిల్లుఁ బృథుప్రతిమోజ్జ్వలుండు. 3

ఉ. ఆయవనీతలేశ్వరునియన్వయమం దహిమాంశుతుల్యతే
జోయుతు లత్యుదారులు విశుద్ధచరిత్రులు శూరశేఖరుల్
ధీయుతు లుద్భవించిరి; తదీయమహాన్వయవార్ధిపూర్ణిమా
త్రేయుఁడనన్ జనించె నొక ఱేఁడు ప్రభాకరవర్ధనాఖ్యుఁడై.

సీ. గాంధారరాజేంద్రగంధహస్తికిఁ గూట
పాకలం బెవనిదీప్రప్రతాప
మహితహూణకురంగహర్యక్షగర్జాని
నాద మెవ్వనిజయానకరవంబు
ప్రాజ్యమాలవమహారాజ్యలక్ష్మీలతా
పరశు వెవ్వనిదీర్ఘభయదహేతి
సింధుమహీనాథసింధునిర్మథనోరు
మంథాన మెవ్వనిమహితభుజము

గీ. చకితఘూర్జరనరనాథజాగరంబు
లెవనిఘోటకధట్టికాహేష లతఁడు
తనరె రాజాధిరాజప్రతాపశాలి
బిరుదములతోఁ బ్రభాకరాభిఖ్య నతఁడు. 5

చ. హృదయములందు వహ్నిగతి నీక్షణయుగ్మమునజ్జలంబుగా
నెదఁగదలించునార్పుల సమీరముగాఁ దనువల్లులన్ మహీ
విధముగ శూన్యభావమున విన్నగ భూతమయస్వరూపమై
పొదలు నరేంద్రతేజ మరిభూపతివర్గకులాంగనాతతిన్. 6

సీ. అవిరళయూపదారువుల నాదిమయుగం
బంకురించుచు నున్నయట్లు దోఁచుఁ
గకుబంతములఁ బ్రాఁకుక్రతుధూమతతులచేఁ
గలి పలాయితుఁ డైనకరణిఁ దోఁచు
దేవాలయాగ్రధ్వజావలి ధర్మంబు
పల్లవించినరీతి నుల్లసిల్లు
సర్వోపకరణముల్ జాతరూపము లౌట
హేమాద్రిఁ బంచిన ట్లెసఁగుచుండు
గీ. అవనిసురలోకదీయమానార్ఘకలశ
వారముల భాగ్యసంపదల్ పండినట్లు
పరిఢవిల్లుఁ బ్రభాకరవర్ధనేంద్ర
బాహుపాలితకాశ్యపీవలయమందు. 7

చ. హరి కరవిందవాసిని, పురారికిఁ బర్వతకన్యయున్ సుధా
కరునకు రోహిణీసతి జగజ్జనయిష్ణునకున్ సరస్వతీ
తరుణి మహాసముద్రునకు దైవతవాహినిపోలె నాధరా
వరునకు భార్య యయ్యె గుణవార్ధి యశోవతి కీర్తిపాత్రమై.

క. ధరణీశ్వరుచిత్త మహా
స్కరునంద నిరంతరానుషక్తం బగుటన్
స్థిరభక్తి మూఁడుసంధ్యల
వరుణోపాసన మొనర్చు వాఁడు నిచ్చల్. 9

క. ప్రాతస్సంధ్యాదీప్తులు
శాతక్రతవీదిగంత శైలాంతములన్
దోఁతెంచునంత కవ్వను
ధాతలనాయకుఁడు శయనతలమున్ వీడున్. 10

ఉ. శుద్ధజలావగాహుఁడయి శుక్లదుకూలయుగంబు దాల్చి యా
బద్ధశిఖాకలాపుఁడయి పాండుపటావృతమౌళినై మహా
శ్రద్ధ వసుంధరోల్లిఖిత చండవిభాకరమండలంబునం
దిద్ధయశుండు పూజ యొనరించును గోకనదచ్ఛదంబులన్.

గీ. పుడమి జానువు లుంచి యాభూధవుండు
మహిని గుంకుమలిఖితార్కమండలమునఁ
బద్మరాగమయానర్ఘ భాజనమున
నాత్మహృదయంబు వోలె రక్తాబ్జ ముంచు. 12

ఆ. పుత్త్రిఁ బడయఁ గోరి భూనాథుఁ డాదిత్య
హృదయమంత్రమును దదేకనిష్ఠ
మూఁడుసంధ్యలందు ముదముతో జపియించు
నర్కదేవతాప్రియావహముగ. 13

వ. ఇట్లతిభక్తి నమ్మహారాజేంద్రుం డాదిత్యోపాసనం బొన
ర్చుచుండ నొకనాఁటియామినీసమయంబున. 14

క. సితకర[illegible] సుగుహా
ర్మ్యతలంబున శయనమందు రాజేంద్రుఁడు ; త

త్సతి యతనితల్పపార్శ్వ
స్థితపర్యంకమున నిదురఁ జెందిరి సుఖులై. 15

ఉ. అంతనిశావసానసమయాగతభాస్కరసూతదీప్త లా
శాంతరసీను నిండఁగ సుధాంశుఁడు వెల్వెలఁబారె నంత భూ
కాంతునిధర్మపత్ని భయకంపితకోమలగాత్రివల్లియై
కాంతుని 'నార్యపుత్త్ర! ననుఁగావు' మటంచని లేచెఁ జెచ్చెరన్.

గీ. బాహుపాలితసకలభూవలయమందుఁ
'గావు' మనుమాట వినఁడు భూకాంతుఁ డెపుడు ;
అడియు దేవీముఖంబున నపుడు వినుట
కదరిపడి మేలుకొనె వసుధాధిపుండు. 17

మ. రభసాకృష్టనిశాతఖడ్గము తమిస్రాకాంతసీమంతస
న్నిభమైయొప్పఁగృతాంతరాయమగునిర్నిద్రావకాశంబుభూ
విభుఁ డాత్తోత్తరవస్త్రుఁడై తవమున న్వేఁదోసి పాదార్పణా
రభటీకంపితహర్మ్యుఁడై నిలిచెఁ బర్యంకాగ్రభాగంబునన్.

గీ. ఖడ్గధారాహతతమఃప్రాకరమయూఖ
రేఖ మెదమీఁద వ్రాలినరీతి నొక్క
మౌక్తికసరంబు కంఠసీమను వెలుంగఁ
గనకవలయంబు ముంజేతికడకు జాఱి. 19

గీ. రాజ్యరమ ముద్దులిడఁ దమ్మరసము సోఁకె
ననఁగ నొప్పారునిద్రారుణాంబకములు

కోపవశమున నీరెండ గురియుచుండ
బూమముడికిఁ జిమ్మచీఁకటి మునుఁగువడఁగ. 20

క. అంతఃపురపరిజన మ
త్యంతభయాకులత లేచి యహమహమికతోఁ
జెంతకుఁ బరుగిడ విభుఁ డో
కాంతా! భయ ముడుగు మనుచు గ్రక్కునఁ బలికెన్. 21

క. పలికి భయహేతు వారయ
నలుమూలలు వెదకి మనుజనాథుఁడు భీతిం
గోలుపున దెద్దియుఁ గానక
చెలువా! భయకారణంబుఁ జెప్పు మని యడిగెన్. 22

సీ. సాధ్వసం బొకయింత సడలినంతనె దేవి
యధిపుని జూచి యోయార్యపుత్త్ర!
మధ్యందినాదిత్యమండలంబున నుండి
బాలకు లిరువు రప్రతిమతేజు
లుదయార్కసమవర్ణు లుజ్జ్వలాంగదభుజుల్
కవచకుండలఖడ్గకలితమూర్తు
లతిమనోహరకిరీటాంచితమస్తకు
లస్త్రాభిషిక్తసర్వాపఘనులు

గీ. పుడమిజనములు చేమోడ్చి మ్రొక్కుచుండ
కలుషమార్గవ్య దపికల్పి నవతరించి

నట్టిశశికలఁ బోలుకన్యకను గూడి
దివ్యమూర్తులతో నేగుదెంచి రిలకు. 23

గీ. ఏను వలదని వారి వారించుచుండఁ
గ్రూరకరవాలమున నాదుకుక్షిఁ జీల్చి
గర్భగోళముసం జొరఁగడఁగి రంత
భీతి మేల్కాంచితిని మిమ్ముఁ బిలుచు సచివ ! 24

గీ. స్వప్నగతవృత్త మీరీతి జలజనయన
విభునితో విన్నవించెడు వేళయందుఁ
జెలఁగెఁ బ్రత్యూషశంఖకాహళనినాద
బంధురంబయి మాంగళ్యపటహారవము. 25

గీ. వందిమాగధమంగళపాఠరవము
జయజయధ్వానములతోడఁ జదలఁ బర్వె
హైమకోణాహతంబయి హర్మ్యవీథి
మొరసెఁ బ్రత్యూషనాంది దిఙ్ముఖము లందు. 26

గీ. వాజిశాలల హేషారవంబు లెసఁగె
మందురాపాలకులు నిద్రమబ్బు వీడి
హరితయవసంబు లుత్తమహరుల కిడుచుఁ
జదివి రీపద్యయుగళి నుచ్చైస్స్వరమున. 27

క. తరువికృతినిధియు నస్మణి
పరిపూర్ణనిజప్రభానుభావమువలనన్

బృథుకనిర్మలకాంతిసుధఁ గ్రోలినట్టు లా
యమకు భోజనముపై నాస తొలఁగె
గీ. గర్భభారాలసాంగినై కడుఁ బ్రియత్న
పూర్వకఁబుగ గురులకు మ్రొక్కుచుండె
విశ్రమించిన, మణిమయభిత్తిసీమ
సాలభంజికవోలె నాచాన దోఁచె. 32

సీ. తనసీడ మణిభిత్తిఁ గని వేడుఁ గైదండ
చెలులసంగతి వేఱ పలుక నేల
గృహరత్నమణిదీప్తిఁ గేలూఁతఁ గొనఁజూచు
ముంగిటితీవలముచ్చ టేల
ముదల పెట్టఁగనోప దెదుటిచేటిని జూచి
చెయిఁ జేసికొనుమాటఁ జెప్ప నేల
హర్మ్య మెక్కెడుతలం పైన లోఁ జొప్పఁబో
దడుగు పెట్టెడుమాట లడుగ నేల
గీ. కాలు సేయార్ప నోపదు కంబుకంఠి
తొడవుబరువులతొడుసులు నొడువ నేల
చెలులు నూర్వురు పరిచర్య సేయుచుండఁ
బూర్ణగర్భిణియై రాజ్ఞి పొలుపుమీఱె. 33

గీ. తనసపత్నులతలలఁ బాదములు సాఁచి
చెలులయొడిలోన నెమ్మేని జేర్చి డేసి

మెసఁగెఁ బురమున శంఖకాహళమృదంగ
పటహనిస్సాణముల నుత్సవంబు లొప్పె. 37

వ. ఇట్లు కొంతకాలం బతిక్రమించినయనంతరంబ యశోవతీ దేవి హృదయదౌహృదంబుల హర్షోదయలక్షణంబు లంకురించుటయు. 38

ఉ. శ్రావణమాస మంతఁ గడుసన్నిహితంబగుడున్ యశోవతీ
దేవి విశుద్ధదేహమునఁ దె ల్పధికంబయి తోఁచెఁ దత్కుచ
గ్రావము లూర్జితంబులయికప్రముఖంబుల నొప్పనొప్పె నా
భూవిభుఁ బోవ నుంచినసముద్రపయఃకలశద్వయం బనన్.

గీ. దుగ్ధసంజననార్థమై దుహిణుఁ డబల
వదనమున నుంచుక్షీరపరివాహ మనఁగ
దీర్ఘసుస్నిగ్ధధవళమై దేవిదృష్టి
మధురతమమయ్యెఁ బదియవమాసమందు. 40

గీ. సకలమంగళదేవతాసమితి దేవి
నావహించిన బరువెక్కె నంగ మనఁగ
మందమై యొప్పె గమన మామనుజనాథ
పత్ని కపుడు కఠోరగర్భంబుకలిమి. 41

చ. నెలఁత నవేంద్రనీలమణినిర్మితభూమిఁ జరించు వేళ నా
యలికులవేణిపాదముల నంటి ధరం బ్రతిమాచ్ఛలంబునన్

జలనిధిమేఖలాతరుణి చాయఁగతిఁ జరియించుచుండు నా
కలికికఠోరగర్భమునఁ గ్రాలెడుభూపతిగౌరవంబునన్. 42

ఉ. వెన్నెలరేల గర్భభరవేదన కోర్వక చంద్రశాలలం
దున్న మరుద్విధూతమయి యుగ్మలివయ్యెద జాఱఁ బాండుర
స్విన్నపయోధరద్వితయబింబితమై యమృతాంశుమండలం
బెన్నఁగఁ బొల్చె గర్భమున కెత్తుసితాతపవారణం బనన్. 43

మ. కలలం గాంచు నిశాంతయామముల దిగ్దంతావళోద్దండహ
స్తలసత్తోయజపత్రపాత్రకలితస్వచ్ఛాంబుపూరంబులన్
జలకంబాడినరీతి దిక్పతులయాస్థానంబులం దుండి దూ
తలు కాన్కల్గొనివచ్చియిచ్చినటు లాతన్వంగి మోదంబునన్

సీ. ఆటలందైన నాయంభోజపత్రాక్షి
సైఁప దాజ్ఞాభంగచాపలంబు
వారాసు లన్నియు వసుధ నొక్కటి చేసి
యానీట మజ్జనంబాడఁ దలఁచు
మొగముఁ జూచుకొనంగ ముకురంబు వెట్టిన
వలదని మెఱుఁగుకత్తులనె చూచుఁ
జెవి కింపు లగువిపంచికలఁ గాదని పల్కు
వినఁగోరు నాదేవి విండ్లమ్రోఁత

గీ. కనకపంజరశుకశారికాకలాప
సముదయంబులఁ గాదని చంచలాక్షి

మరగిచూచును లోహపంజరనిబద్ధ
చండశార్దూలసింహాదిసత్త్వచయము. 45

క. వేలాలతాగృహోదర
లీలాసంచారవాంఛ లేమకుఁ గలిగెన్
జాలాలికోర్కి నిజగ
ర్భాలయగతపృథుకచింతితార్థమ కాదే. 46

వ. అంతటఁ బ్రసవదివసంబు లాసన్నంబు లగుటయు 47

క. అష్టాంగాయుర్వేదని
విష్టాత్మకు లఖిలవైద్యవిద్యాసారో
త్కృష్టమతు లధిపుపత్నిక
రిష్టాలయ మప్పు డేర్పరించిరి ప్రీతిన్. 48

గీ. జ్యేష్ఠమాసాపరార్ధవిశిష్ట మయిన
ద్వాదశీతిథిఁ బావకతార నర్ధ
రాత్రమున హర్షసూచకారావ మొండు
వెడలె నంతఃపురాంగనావిసరమందు. 49

ఉ. అంతట రాజ్ఞియాదరము నందినదాదితనూజ వచ్చి భూ
కాంతుని మ్రోల నిల్చి కరకంజములన్ ముకుళించి దేవ! శు
ద్ధాంతమునన్ ద్వితీయసుతునర్మిలిఁ గాంచెను దేవియంచుఁ దా
నెంతయుఁ బ్రీతిఁ దెల్పి హరియించెసమంచితపూర్ణపాత్రమున్

చ. అపుడు త్రికాలవేదియును హారికుఁడు న్మహాయోగవేత్తయు న్
నృపునకు మాననీయుఁడు ననింద్యచరిత్రుఁడు నైన తాంత్రికుం
డపరిమితప్రమోదమున నానరనాథుని గాంచి దేవ ! మీ
తపము ఫలించె నీసుతుఁడుదాత్తగుణోత్తరుఁడయ్యెడు న్ జుమీ

సీ. దేవ! యీదినము వ్యతీపాతముఖదోష
వర్జితం బగుట శుభప్రదంబు
అజవృషమృగకుళీరాంత్యజూకంబులం
దర్కేందువక్రార్యశుక్రకృష్ణ
లుచ్చులై యుండుట నుర్వీశ ! యీబాలుఁ
డఖిలలోకేశ్వరుం డగునజుమ్ము
తొల్లి మాంధాతృభూవల్లభుం డొక్కండె
జనియించె నీదృశసమయమందు

గీ. అదియె మొదలుగ నిందాక యధిపముఖ్యుఁ
డొక్కఁడును బుట్టఁ డిటువంటి యోగమందు
భూతలాధీశ! నామాట బొంకు గాదు
అట్లు గాఁ జూతు వీవు కాలాంతరమున. 52

గీ. సప్తభూపాగ్రగణ్యుఁడై సప్తతంతు
పాలకుండయి సప్తాశ్వనిభత వెలిఁగి
సప్తసాగరవేష్టితక్ష్మాతలంబు
నేలుఁ బురుహూతులీల నీబాలకుండు. 53

సీ. జననాథ ! యీతనిసామజఘటలచే
నరిరాజసాలంబు లవియునాఁడు
కుతలేశ ! యీతని ఘోటకధట్టికా
ఖురధూళి రవిదీప్తిఁ గొన్ననాఁడు
వసుధేశ ! యీతనిభటకృపాణమరీచు
లఖిలదిఙ్ముఖముల నడరునాఁడు
అవనీశ ! యితనిజయస్తంభసంతతుల్
నిఖిలదేశంబుల నిలుచునాఁడు

గీ. సకలసామంతభూపాలసంఘమకుట
చారుమాణిక్యరంజితచరణుఁ డగుచు
నవని నేకాతపత్రమహావిభూతి
నేలునాఁడును దలఁతు పీ మేలిమాట. 54

మ. ధరణీనాథునివీటిలో నపు డనాధ్మాతంబులై శంఖముల్
మొరసెన్ భేరులనాహతంబులగుచున్ మ్రోసెన్ మరంగారవ
స్ఫురణల్మత్తగజేంద్రబృంహితములు నొప్పెల్లారె ఫుల్లాబ్జగం
ధరమాబంధురమంథరానిలములున్ వ్యాపించె దిగ్భిత్తులన్.

గీ. సవనకర్తలపావకశాలలందు
దక్షిణావర్తశిఖాకాంతతులతోడ
భావిశుభమును దెలిపెడుపగిది వెలిఁగె
జాతవేదుఁ డనింధనజ్వాలుఁ డగుచు. 56

సీ. తపనీయశృంఖలాదామబద్ధమహాని
ధానభాండములు గర్తముల నుబికెఁ
బటుతరమాంగళ్యపటహభేరీనాద
ముఖరంబు లయ్యె దిఙ్ముఖము లెల్ల
శ్రుతిసుభగాననల్ శుక్లాంబరావృతుల్
వృథమయుగప్రజాపతు లనంగ
విభునిసంతానాభివృద్ధి నాకాంక్షించి
యగ్రజాతులు వచ్చి రధిపుఁ జూడఁ
గీ. దనువుఁ గైకొన్నవైదికధర్మ మనఁగ
శాంత్యుదకకుంభ ఫలకుశాక్షతపవిత్ర
పాణియై వచ్చె నామహీపాలుకడకు
రుచిరవేషముఁ దాల్చి పురోహితుండు. 57

గీ. శ్మశ్రుజటిలాననులు పంకమలినగాత్రు
లపుడు బంధవిముక్తులై యాకులముగ
నగరఘంటాపథమున నంతన మెలర్పఁ
జనుచు లెత్తిరి కలికాలబంధు లనఁగ. 58

గీ. నృపగతాఖిలసేవ్యసేవకవిభాగ
మస్తమిత్రారికులసముదాచరణము
పుణ్యపణ్యాంగనాదుర్విబోధలీల
మెప్పె సప్తాహము పుత్త్రజన్మోత్సవంబు. 59

క. ఎంతటివారల కైనను
బొంతకుఁ బోరానియంతిపురమప్పుడు భూ
కాంతునిపుత్త్రునిఁ గనుఁగొన
సంతసమున వచ్చుపౌరజనతతి నిండెన్. 60

సీ. సురలోకమును వీడి ధరణికే తెంచిన
యప్సరస్త్రీసమూహంబు లనఁగ
వైకుంఠమును వీడి వసుధకు వచ్చిన
దామోదరావరోధము లనంగ
అసురగర్తము వీడి యవనికి డిగ్గిన
భుజగేంద్రకన్యకాపుంజ మనఁగ
జలదగర్భముఁ బాసి జగతిపైఁ జరియించు
చటులశంపాలతాశతము లనఁగ

గీ. భవ్యసామంతనరపాలపత్న్యు లాత్మ
పరిజనము వెంట మణిమయభాజనముల
సంకుమదకుంకుమాగురుస్నానచూర్ణ
వస్తువులు దేర వచ్చి రాబాలుఁ జూడ. 61

చ. సరసమృదంగవంశరవసంగతిఁ బాడుచు రత్నకంకణ
స్ఫురణమనోహరంబులయి పొల్చుకరాబ్జము లెత్తి కక్షభా
గరుచులు దర్శనీయమయి గాల్పఁ జలచ్చరణాబ్జకింకిణుల్
మొరయఁగ నాడి రెల్లెడల భోగనితంబిను లాపురంబునన్.

సీ. కోపాభినయములఁ గోమలభ్రూలతా
కళలఁ గొట్టినరీతిఁ గానుపింపఁ
బ్రణయాభినయములు ప్రచరించుపట్టుల
రసములు వర్షించురాణ మెఱయఁ
జతురచంక్రమణముల్ సవరించుపట్టుల
భావవికారవిభ్రమము లెనఁగఁ
గడకంటిచూపులఁ గనుగొనుజనులందుఁ
గువలయాంబకములు గురియుచుండ

గీ. హంసకధ్వని రాయంచ లనుకరింప
విటసమూహములకు శ్రోత్రపేయ మగుచు
బరగునల్లీలరాసకపదము లెలమిఁ
బాడు చాడికి భోగముపడుచు లపుడు. 63

చ. కలితవిచిత్రచంక్రమణకమ్రపదంబుల లత్తుక న్మహీ
తలమున రాగ మొప్పఁగ నుదారపయోధరపూర్ణకుంభము
ల్పొలుపెసలారఁ జారుకరపుష్కరతోరణపంక్తు లొప్ప వి
చ్చలవిడిఁ గొండ్లిసల్పిరి పిశాచముసోఁకినరీతి రాట్పుతుల్.

గీ. అఖిలజనహర్షవర్ధనుం డగుటఁ జేసి
హర్షవర్ధనుఁ డనునామ మధిపుఁ డొసఁగె
శుక్లపక్షనిశాకరస్ఫూర్తితోడ
బాలకుండును దినదినప్రౌఢి మెఱసె. 65

గీ. పుత్త్రజన్మోత్సవంబు లాపుడమిఱేని
వీటఁ గడువైభవంబున విస్తరిల్లె
నంతఁ గతిపయవర్షంబు లంతరించె
రాజ్యవర్ధనుఁ డాఱేండ్లప్రాయ మందె. 66

సీ. రంగత్ప్రతాపస్ఫులింగంబు లనఁగ మూ
ర్ధమున రక్షాసర్షపములు సెలఁగ
వలఁగొన్న బాహుజప్రౌఢతేజ మనంగ
గోరోచనపుఁబూఁత కొమరుమిగుల
నంకురించినదర్ప మనఁగ వక్షంబున
బంగారుఁబులిగోటిపదక మమరఁ
దల్లిచన్నులపాలఁ దడిసి మొల్చినరీతి
దంతాంకురములు వక్త్రమునఁ దనర
గీ. నంతిపురమున నీలువుటాండ్రు తమదు
శీలమునుబోలె రక్షింప సింహశాబ
కంబుకైవడి భటశస్త్రకలితపంజ
రమున హర్షుండు దినదినప్రౌఢి మెఱసె. 67

మ. ఖరశార్దూలనఖాంకురాంచితమణిగ్రైవేయకాలంకృత
స్థిరవక్షుండయి క్షత్త్రియోచితమహాదీప్తిస్ఫురన్మూర్తియై
ధరణీనాథసుతుండు తప్పటడుగుల్ దాఁబెట్టనేర్వన్ బ్రభా
కరరాజేంద్రసతీవతంసమునకున్ గన్పట్టె గర్భం బొగిన్.

తరువోజ. ధరణీతలేశునితరుణీమతల్లి
దశమాసములు నిండఁ దనయను గాంచె
గరిమఁ దొల్కారి శరత్కాలంబుభంగి
ఘనశుక్లపాడ్యమి కమలారిఁ బోలె
వరుణాలయము రత్నవారంబుభాతి
భాసురమధులక్ష్మి వనరాజిఁబోలె
గిరిరాజపత్ని యాగీర్వాణవంద్యఁ
గృత్తివాసుని దేవిఁ గిరిజఁ గన్నట్లు. 69

గీ. చన్నుఁగవమీఁద ముత్యాలసరముభంగిఁ
దనయు లిరువురపైఁ గన్నతనయఁ గాంచి
ఆఁడుబిడ్డలమురిపెంబు లమరె ననుచు
నామహారాజ్ఞి సమధికాహ్లాద మందె. 70

ఉ. రాజతనూజు లంత మృగరాజకిశోరయుగంబుభంగి వి
భ్రాజితదేహసంపదల వర్ధిలుచుండఁగ దేవిసోదరుం
డాజికుమారతుల్యుఁ డగునాత్మజు రూపవిలాసవిభ్రమ
శ్రీజితపంచబాణు నృపుచెంతకుఁ దోడ్కొనివచ్చి యిట్లనున్.

చ. అనఘ మదీయపుత్త్రికను దంచితచంచలపంచమూను నీ
తనయుల నెల్లవేళలను దప్పరతఁ గ్రాలుచుంగ నిచ్చితిన్
గొను మిఁకఁ డెన్ని దేంప్లపసికుఱ్ఱఁడటం చెనఁగొంకఁ బోల ద
య్యనలము పన్నగాగశకలాకృతినైన దహింపకుండునే.

గీ. శౌర్యవృక్షంపుసూక్ష్మబీజం బనంగఁ
గరఁగిపోసినక్షాత్త్రవిగ్రహ మనంగఁ
దనరుసుతు భండి యనువాని ధరణివిభుని
కట్టెదుట నిల్వఁబెట్టి యఖండభక్తి. 73

మ. హరనేత్రానలధూమజాలజటిలప్రాంచచ్ఛిరోభాగుఁడై
మరలన్ రూపముఁదాల్చె మన్మథుఁడన న్మౌళి న్జలత్తాకప
క్షరుచిస్ఫీతుని బుష్పలోహవలయాకల్పప్రకోష్ఠు న్సుతున్
ధరణీనాథునిసేవకై యొసఁగెఁ దాత్పర్యంబు సంధిల్లఁగన్.

గీ. సుతులతోఁగూడ మూఁడవసుతునిభంగిఁ
బొలిచె నాతఁడు; వారలముప్వురందు
లోచనంబులమూఁటఁ ద్రిలోచనునకుఁ
బోలె సమదృష్టి గలిగె నాభూమిపతికి. 75

వ. అంత నారాజపుత్త్రిలు. 76

గీ. ప్రకృతిదక్షిణుఁ డైనయాభండిఁ గూడి
మలయమారుతమును మధుమాధవులును
బోలె జనహృదయంబుల మోద మడరఁ
బెరుఁగుచుండిరి తన్మనఃప్రీతితోడ. 77

వ. వారలకుఁ గ్రమంబున యౌవనోదయం బగుటయు. 78

సీ. సుస్థిరోరుస్తంభశోభాభిరామమై
ఘనప్రకోష్ఠంబులకల్మి మెఱసి

దీర్ఘభుజార్గళదీప్తుల నొప్పారి
పటువిశాలోరఃకవాట మగుచుఁ
బ్రాంశుసాలోన్నతప్రాకారమూర్తి వెలింగి
శస్త్రాస్త్రసంపద్విశాల మగుచుఁ
బరసైన్యభీకరబలసంపదలు గల్గి
వీరయోధసనాథవిభవ మగుచుఁ

గీ. బటునగరసన్నివేశంబు భంగి నొప్పి
రాజ్యలక్ష్మీవిహారాభిరామ మగుచు
రాజపుత్రద్వయంబు దుర్ధర్షలీల
నఖిలలోకాశ్రయత్వమంబై వెలింగె. 79

సీ. చంద్రికావిమలయశఃప్రతాపములచేఁ
జంద్రసూర్యులరీతి జగతి వెలిఁగి
బలతేజముల వాయువహ్నులఁ బురుడించి
మైత్రిచే రెంటిని మలుఁగఁజేసి
ఘనశిలాకఠినాపఘనవైభవంబున
హిమశైలవింధ్యగర్వము లడంచి
పూర్వాపరాశలపోల్కి దీప్తుల కెల్ల
నుదయాస్తమయసమాస్పదము లగుచు

గీ. వైనతేయారుణులరీతి వైభవమున
హరిగమనయోగ్యసమవిభక్తాంగు లగుచుఁ

గర్ణపార్ధ్గలవిధమునఁ గవచమకుట
భూషితోద్దామదేహుల్గా పొలుపుఁగనిరి. 80

ఉ. రాజసమొప్ప నాత్మనఖరాజిఁ గనంబడునీడఁజూచి యు
ద్వేజితులౌదు రద్దములబింబములన్ బ్రతిపూరుషాప్తి ను
త్తేజితులౌదు రబ్ధధృతదీర్ఘమహేంద్రధనుస్సుఁగాంచి యా
రాజకులావతంసులు తిరస్కృతులైనటు లెంతు రాత్మలన్.

గీ. విబుధసేనాని యగుకొ్రంచభేదియందు
స్వామిశబ్దంబు సైఁప రాశౌర్యధనులు
అమలమణిబింబితాతపత్రములఁ గూడ
ద్వైతభావంబు మెచ్చరు ప్రాభవమున. 82

సీ. ఆలేఖ్యనృపులసేవాంజలి గనరామి
కాత్మల సంతాప మందుచుంద్రు
భూరిబలుండయ్యుఁ బోడసూపకున్నయా
భీరు సమీరుని దూరుచుంద్రు
గురుచమరీవాలకోటిపీజితుఁ డైన
ప్రాలేయగిరిప్రాభవంబుఁ గనరు
చతురబ్ధిసామ్రాజ్యసార్వభౌముఁడు ప్రచే
తసుఁ డనుమాటకుఁ గసరుచుంద్రు
గీ. పరిమితాత్మీయమండలపట్టభద్రుఁ
డైనభాస్కరుఁ దమలోన నవహసింత్రు

వార్ధులం గలశంఖవైభవము గాంచి
యుడుకుచుందురు ప్రాభవం బెడలె ననుచు. 83

గీ. అరినరేంద్రప్రతాపదీపాంకురములఁ
జిదుమఁ దద్ధూమలతికలు గదిసె ననఁగ
ననుదినాభ్యస్తశస్త్రవిద్యాసముత్థ
కఠినకిణములు వొలుచుఁ దత్కరములందు. 84

సీ. అనపహృతచ్ఛత్రు లగునరేంద్రులనైన
విచ్ఛాయులుగఁ జేయు వింతనేర్పు
దూరస్థితము లైనదుష్టరాడ్వంశంబు
లూష్మచే దహియించునుగ్రశక్తి
విబుధులయం దసేవితసుప్రసన్నులై
మధు వొలికించుమాటనేర్పు
ప్రసవబాణు లటంచు వసుమతి నుతికెక్కు
వజ్రసారశరాళిఁ జఱపుపటిమ
గీ. పూర్వకౌమారభావవిముక్తిఁ గాంచి
శత్రునిర్మథనోత్సాహశక్తియుక్తి
రాజ్యవర్ధనహర్షవర్ధనులయందె
పుడమి గానంగనయ్యె నపూర్వగరిమ. 85

గీ. రాజ్యవర్ధనహర్షాభిరామనామ
వర్ణములు సాగరాంతరీపములఁ గూడ

నచిరకాలంబులోన విఖ్యాతి గాంచి
దిగ్వధూకర్ణపాళి కాతిథ్య మొసఁగె. 86

క. కృతభోజనుఁడై ధరణీ
పతి యొకనాఁ డంతిపురిని బరమప్రీతిన్
సుతులను రావించి హితా
హితబోధకవాక్యరచన నిట్లని పలికెన్. 97

సీ. ప్రథితరాజ్యాంగంబు ప్రథమవిచార్యంబు
సద్భృత్యలబ్ధి దుస్సాధ్య మవని
బాలకుల్ నెమిలిని బట్టి యాడించిన
ట్లాడింతురి బాలిశు లధిపుఁ బట్టి
నీడను గ్రహియించునిలువుటద్దమువోలె
విటులు గ్రహింతురి భూవిభునిప్రకృతి
కలలపోలిక లేనికల్పనల్ ఘటియించి
భ్రమఁగొల్పుదురు ప్రతారకులు తేని
గీ. మానసాంతరవిస్ఫురన్మత్స్యభంగి
జాలికులు లోనిభావంబు సంగ్రహింతురి
చాతకములట్లు తృష్ణాభిభూతు లగుచు
నిలువ రకులీను లధిపునిపలుకునందు. 88

వ. మఱియు ధూర్తు లుపేక్షితవాతవికారంబులకై వడి గీత
నృత్యహాసితాదుల నున్మాదంబు గలిగింతురు. యమపట్టి

కులవిధంబున నున్నీశకు లంబరచిత్రింబులఁ బ్రదర్శించి
ఛేనిఁ బ్రితాఁరింతురు గావున యోగ్యభృత్యసంపాదనంబు
రాజుల కవశ్యకర్తవ్యంబు. 89

ఉ. మాలవరాజపుత్త్రు లతిమానపవిక్రము లార్యసన్నుతు
ల్లాలితరాజధర్ములును బార్థివులం గొలువంగ నేర్తు ర
బ్బాలుర సర్వదోషపరివర్జితుల న్ననభావిభక్తి సం
శీలురఁ గొల్వనిచ్చితిని జేకొనుఁ డాత్మజులార! ప్రేమమునన్.

ఆ. బాహుయుగ్మకంబుపగిది నెమ్మనికి
వేఱు గాకయున్న వీరియందు
నితరపరిజనములగతి మెలంగకుఁడయ్య!
తనయులార! యనుచు ధరణివిభుఁడు. 91

వ. వారలఁ బిలుపంపంచిన. 92

సీ. అతిగురుచరణవిన్యాసభారంబున
జనపాలసంచారచపలమైన
ధరణికి సుస్థిరత్వము ఘటింపఁగఁజేయు
కరణిని గజరాజగమనలీలఁ
జనుదెంచువాని నష్టాదశవర్ష దే
శీయవయఃపరిస్ఫీతమూర్తిఁ
గర్కశవ్యాయామకఠినమాంసలమేదు
రోరువ్యూహంబున నొప్పువాని

గీ. గాఢతనుతరజంఘాయుగంబువాని
సూక్ష్మతర మైనమధ్యంపుసొబగువానిఁ
బీనవక్షమువాని నాజానుబాహు
మాలవేశ్వరసుతుని సుమారగుప్తు. 93

గీ. లలితవిక్షిప్తబాహార్గళములచేత
దుస్తరం బగుయౌవనతోయరాశి
దాఁట నీఁదెడున ట్లొప్పు ధైర్యధనుని
మొదటఁ గాంచిరి నరనాథపుత్త్రు లెలమి. 94

ఉ. ఆతనివెన్క సాలసముదగ్రశరీరుఁడు గౌరవర్ణుఁ డ
బ్జాతవిశాలలోచనుఁడు జంగమమేరునగంబుఁబోలె నా
భూతలనాథనందను లపూర్వముదంబునఁ దన్నుఁ జూడ సం
ప్రీతిని వచ్చె నగ్రజునివెన్కనె మాధవగుప్తుఁ డుద్ధతిన్.

తే. సార్వభౌమపరీహారసహితు లగుచు
మాలవేశ్వరపుత్త్రు లామనుజనాథు
సన్నిధికి వచ్చి ప్రణమిల్లి చక్రవర్తి
యాన నుచితాసనముల నాసీను లైరి. 96

సీ. ఉర్వీశుఁ డంత ముహూర్త మూరక యుండి
వారిని గాంచి యో బాలురార!
ఈనాఁడు మొదలుగా నింగితజ్ఞుల రయి
కొలువుఁడు నాదుపుత్త్రుల నటంచు

నానతియిచ్చె వా రంత దిగ్గన లేచి
రాజ్యవర్ధనహర్ష రాణ్మణులకుఁ
బ్రణమిల్లి రప్పు డా రాజకుమారులు
జనకుని పదపంకజముల కెఱగి

గీ. రదియ మొదలుగ వారును నధిపసుతుల
పార్శ్వముల బాహువులువోలెఁ బరిఢవిల్లి
యభిముఖంబుగ నూర్పుల ట్లనుసరించి
కొలుచుచుండిరి తోడునీడలునుబోలె. 97

గీ. అనుదినంబును నృత్తగీతాదిసకల
కలలయందును బాండిత్యగరిమఁ గాంచి
శుక్లపక్షంపుసోమునిసాబగుఁ దెగడి
రాజపుత్రియు దినదినప్రౌఢి మెఱసె. 98

వ. అంతం గతిపయదివసంబులకు రాజ్యశ్రీకి యౌవనోదయం
బగుటయు. 99

గీ. అఖిలవసుధేశ్వరులకటాక్షాశుగములు
మానినీలక్ష్యమున నొక్కమాఱు వడియెఁ
బరిణయోత్సుకులై మహీపాలసుతులు
దూతముఖమున వేఁడిరి భూతలేంద్రు. 100

క. అంతఁ బ్రభాకరవర్ధనుఁ
గాంతిపూర్ణ దేవితో రహస్యంబున నిట్లా

మంతనము సలుపువాఁడయి
వంతం దనయావివాహవార్తఁ బలికెన్. 101.

మ. అరయంగన్యకుఁ బెండ్లియీడొదవె రాజ్యశ్రీగుణశ్రేణితోఁ
సరిగాఁ జింతయు లోననెక్కొనియె వత్సాయౌవనారంభమం
దురుసంతాపదవాగ్ని కింధనములై యుద్వేగముం బొందరే
తరుణిం గాంచినతల్లిదండ్రులు సముద్యత్పూర్ణచంద్రాననా!

మ. కడుపారంగని యెత్తిపెంచికొని యంకస్థాయినింజేసి ప్రే
ముడి లాలించినయాత్మజాత నకటా మున్నెన్నఁడుం గంటికిన్
బొడఁగానంబడనట్టిపూరుషుఁడు కొంపోవన్ వివాహం బనం
బడుతంత్రంబున దుస్సహం బిడియపోపద్మాక్షి! వీక్షింపఁగన్.

క. తనయాపయోధరోన్నతి
ఘనతమమున నింపె హృదయగహ్వరమును నీ
గోనములప్రోవున కెవ్వం
డనురూపుఁడు వరుఁడు గలఁడొ యరయఁగవలయున్.

ఆ. కాన సాధుజనులు కన్యఁ గన్నప్పుడె
జలము లిత్తు రశ్రుసలిలములను
సంయమములును నిట్టిసంసారబాధకై
వసతి వీడి శూన్యవని వసింత్రు. 105

గీ. వరులకడనుండి దూతలు వచ్చుకొలఁదిఁ
బాడుచింతాజ్వరము సిగ్గుపడినయట్లు

లంతకంతకు నెదలోన నణఁగుచుండెఁ

గన్నబిడ్డల నెడఁబాయఁగల్గు నెవఁడు ? 106

ఉ. ఐనను లోకధర్మము గృహస్థుల కెన్నఁడు దాఁటరానిదౌఁ

గాన నవశ్యమున్ వెనకి కన్నియ నొక్కని కీయఁగావలెన్

జానకొ! యెంచఁగా వరునిసద్గుణసంతతి కంతమున్నదే

ధీనిధు లొక్కవంశమును దృష్టిపథంబున నుంతు చెప్పెదన్.

క. ధరణీధరమూర్ధస్థిత

హరచరణన్యాసమట్లు లఖిలజనౌఘ

స్థిరభక్తిపాత్రమగుచున్

ధర మౌఖరివంశ మత్యుదాత్తత నొప్పున్. 108

గీ. ఆకులాంభోధి కమృతాంశుఁ డనఁగ నొప్పి

మంతొకెక్కెను జగతి నవంతివర్మ

అతివ! గ్రహవర్మ యాతనియగ్రసుతుఁడు

జనకునకు మిన్న సద్గుణసమితియందు. 109

క. ఆరాజపుత్త్రుఁ డిపు డే

వారిజనేత్రపాణిపంకేరుహమున్

గోరుచునున్నాఁ డతివరో !

యారసి వచియింపు మిష్టమగునే నిత్తున్. 110

మ. అనినన్ సిగ్గుచుఁ బొంది మోహమున నయ్యార్యోక్తి బా

ష్పాంబులో! చనుదెంచు నాథ! సుతానుపాలనము తత్సం

జాతసంప్రీతియుఁ । జననీధర్మము కన్నె నిచ్చునెడలఁ స
ర్వాధికారుల్ పితల్ । తనయాస్నేహము తల్లికెక్కుఁ
డగుఁ బుత్త్రిప్రేమకంటెఁ భువిఁ. 111

గీ. అధిప ! కన్నియఁ గూర్చి రూపవంతమైన
వంత మన కెప్పు డుండనిభంగి యరసి
వరుసి గూర్పుఁ డటంచు నావనిత పలికె
నృపుఁడు గ్రహవర్మ కొసఁగఁ దా నిశ్చయించె. 112

వ. అంత నొకశుభదివసంబున గ్రహవర్మకడనుండి వచ్చిన
ప్రధానదూతం బిలిపించి సర్వరాజసమక్షంబున. 113

ఆ. రాజు, సుతులఁగూడ రావించి తనయావి
వాహవార్తఁ దెలిపి వరునిదూత
పాణి సకలరాజవర్గంబు గనుచుండ
వదలె దుహితృదానవారిధార. 114

క. ముదితాంతరంగుఁ డగుచుఁ
గదలెను దూతయును రాజకార్యముఁ దెలుపఁ
బదఁపడి సకలజనంబులు
ముదమునఁ బోదలంగఁ బెండ్లిపోద్దులు వచ్చెఁ. 115

సీ. శిల్పిసమూహం బనల్పంబుగా వచ్చి
కై సేయఁదొడఁగె భూకాంతునగరు
సకలభూములనుండి సామంతులేతెంచి
యులుపా భోసంగి రాయుర్విపతికి

గ్రామీణు లొసఁగునుగ్రాణంపుసంభార
ములను దెచ్చిరి రాజపురుషవరులు
ఆహూతులైనమహారాజబంధువ
ర్గములకు విడిద లేర్పరుపఁబడియెఁ
గీ. జటులహేలామదోల్లసచ్చర్మకార
కరకలితభర్మకోణసంఘట్టితోరు
ఘోటికానాదదళితదిగ్భిత్తి యగుచుఁ
పలికె నెల్లను మాంగళ్యపటహరవము. 116

గీ. అమలకుసుమాంగరాగమాల్యములు దాల్చి
సూత్రధారులు పంచాంగశుద్ధమైన
దినమునందు వివాహవేదికను గూర్చి
సంస్కరించిరి కల్యాణశాల నెలమి. 117

సీ. నవసుధారససేచనమునఁ బ్రాసాదంబు
భాసిల్లె రజతపర్వత మనంగ
ఉద్వాహశాలలం దొగిఁ జిత్రకారులు
లిఖియించి రుత్తమాలేఖ్యసమితి
ఘనరత్నసహితకాంచనభూషణావళుల్
ఘటియించె విభుహేమకారకులము
మాకందపత్రరంభానారికేళతో
రణముల విభుమందిరంబు లొప్పె

గీ. సకలసామంతభూపాలసంఘ మెల్ల
భూపనిర్దిష్టకర్మకలాపములను
బద్ధపరికరులై యొనర్పంగ నపుడు
చూడ నొప్పారె నుద్వాహశుభదినములు. 118

సీ. హృదయంబుచేతఁ బ్రాణేశ్వరునందును
బ్రీతిచేతను దనకూఁతునందు
నుపచారములసమాహూతాంగనలయందుఁ
గౌతుకోన్నతిని జామాతయందుఁ
దనువుచే గమనాగమనకార్యములయందు
నాజ్ఞలచే భుజిష్యాళియందు
నక్షుల నకృతకృతాఖిలక్రియలందు
సంభ్రమంబునఁ గార్యసరణియందు
గీ. సమధికానందమున మహోత్సవమునందుఁ
బాలుగొనుచును దనయావివాహజనిత
మోదమున దేవి బహురూపములను దాల్చె
ననఁగ శోభిల్లెఁ బనులెల్ల నరసికొనుచు. 119

సీ. రాజకులంబెల్ల రమణీమయం బయ్యె
సర్గ మెల్లను బంధువర్గ మయ్యెఁ
గకుబంతములు చారణకుమారమయ మయ్యె
మంగళమయ మయ్యె మనుజసమితి

యంబరతలము తూర్యారావమయ మయ్యె
నిర్వృతిమయ మయ్యె నిఖిలజగము
పరిజనంబు విచిత్రివస్త్రిమయం బయ్యెఁ
గాల మెల్లను సుఖాకార మయ్యె

గీ. నపుడు మహాహూర్తికాహూత మైనయట్లు
ధ్వజపటాంచలదృష్టమై వచ్చినట్లు
జనమనోరథములు ఫలించినవిధమున
వచ్చె నుద్వాహమంగళవాసరంబు. 120

వ. అంతఁ బ్రాతఃకాలంబున. 121

గీ. పరులు సొరకుండ నపుడు భూపాలునగరు
వేత్రికరపాలితం బయి వెలయుచుండె
ద్వారపాలకుఁ డేతెంచి పార్థివునకు
వినయమున మ్రొక్కి యిట్లని విన్నవించె. 122

వ. దేవా! అల్లునియొద్దనుండి పారిజాతకుఁ డనుతాంబూల దాయకుం డరుగుదెంచె ననిపలికి దర్శనీయుఁ డగునొక్క పురుషుని రాజునకుఁ గనపఱచె. విభుండును సంజాత కుతూహలుం డయి. 123

ఆ. అల్లునందుఁ గలునాదరంబునఁ జేసి
గౌరవమున నతనిఁ జేరఁ బిలిచి
పారిజాతకునకుఁ బసదనం బిచ్చి జా
మాతసేమ మడిగె మనుజవిభుఁడు. 124

క. సేవాచతురుఁ డతండు మ
హీవిభుపదపంకజముల కెఱగుచు భక్తిన్
దేవా! కుశలియె యాతఁడు
దేవరకును నిజనమస్కృతిం దెలుపు మనెన్. 125

గీ. అనుటయును భూతలేశుఁడు హర్షమంది
పారిజాతక! యీరాత్రి ప్రథమయామ
మునను సుముహూర్తమటుగానఁ బ్రొద్దెఱింగి
యాలసింపకు మనుము వియ్యాలవారి. 126

వ. అని తన్ముఖంబునను ప్రతిసందేశ మంపె నంత. 127

చ. కమలవనంబులందుఁ గల కాంతిని సర్వము కన్నెమోముసం
పదఁ బరఁగఁ జేసిపోయె ననునట్లు దినంబు దొలంగె; వేడ్కతో
సమధికవైభవం బెసఁగ సాఁగువివాహదినేందిరాంఘ్రిప
ద్మమునఁ గనొప్పె భాస్కరునిమండల మూర్జితరాగసంపదన్.

గీ. సమధికవధూవరానురాగమును గాంచి
చక్రవాకయుగములు లజ్జాభరమున
విఘటమానము లైనట్లు వీడిపోయె
నపరదిశ సంజకెంజాయ లలమికొనియె. 129

క. వరయాత్రాగమనరజః
పరిభూసరమయ్యె గగనభాగం బనఁగా

సురుపారావతగళక
స్ఫురములు తమములు దిగంతముల నిండె వెనక. 130

క. పరిణయమంగళకలశ
స్ఫురణంబునఁ బొలిచె నపుడు పూర్వాద్రిపయిఁ
హరిణాంకుఁ డాత్మతేజః
పరిపూరితపూర్వదిగ్విభాగుం డగుచున్ 131

ఉ. కన్నియమోముచందురుఁడు గా సెకువెన్నెలపిండు చేతనే
పన్నినచీఁకటుల్ విరియఁబాఱె సుధాకిరణుం డదేలోకో
మిన్నులకెక్కి నిక్కెనని మెల్లఁగ నవ్వినరీతిఁ గల్వరా
కన్నియ లల్లనల్లన వికాసముఁజూపె సరోవరంబులన్. 132

వ. అట్టియామినీప్రథమయామారంభంబున. 133

ఉ. ముందర నశ్వపాలకులు భూజవంబునఁ ఒప్పులెత్తఁగా
సుందరవల్గదశ్వములు చోద్యముగాఁ జఱితెంచె నత్కట
స్యందిమదాంబులోలమధుపారవసంకులమై కరిణ్మహా
బృందము వచ్చెఁ జీఁకటులు వెండియు భూమికి డిగ్గెనో యనన్.

గీ. చారుసౌవర్ణపరికరాచ్ఛాదితములు
కాంస్యమయఘంటికాఘణంఘణనినాద
ముఖరితాశాంతరంబులు భూధరోప
మానములు నయి వచ్చుసామజములందు. 135

గీ. హైమనరాజితబింబుచిత్రాంబరంబుఁ
బూని నక్షత్రమాలికాభూషితోరు
మూర్ధమై వచ్చుగజరాజుమూపుమీఁదఁ
బొడుపుఁగొండ వెలుంగుసోమునివిధానఁ. 136

గీ. గంధతైలావసిక్తమై కాంతులీను
వజ్రకటకరదీపికాసహస్రములు వెలుఁగ
మల్లికాదామవేష్టితమౌళి యగుచు
వచ్చె గ్రహావర్మ శంబరవైరికరణి. 137

చ. వసుఁ డిటువైభవంబెసఁగ వచ్చెడువార్త యెఱింగి ధారుణీ
శ్వరుఁడు సుతాప్తమంత్రిజనవర్గము గొల్వఁగఁ బాదచారియై
పరమముదంబుతో నెదురువచ్చిన నాగ్రహావర్మ గంధసిం
ధురమును డిగ్గి రాజపదతోయరుహంబుల వ్రాలె నమ్రుఁడై.

ఉ. అల్లుని లేవనెత్తి విభుఁ డాదరమొప్పఁ గవుంగిలించి త
త్పల్లవపాటలం బయినపాణిని గేల నమర్చి వేడ్కఁ సం
ధిల్ల గృహంబులోని కతనిం గొనిపోయి తదీయచిత్తము
త్ఫుల్లముగా సమస్తవిధపూజ లొనర్చె మహోత్సవంబునన్.

వ. అపుడు రాజేంద్రునకుఁ బ్రియమిత్రుండును విద్వాంసుం
డును నయినగంభీరుం డనుబ్రాహ్మణుండు గ్రహావర్మతో
నిట్లనియె. 140

గీ. ధరణి బుధకర్ణసంతోషదాయకంబు
లైనసోమార్కకులములయట్టు లార్య
పూాభరికులంబు మారాజమాన్యకులముఁ
గలిసె మాభర్తృదారికాకారణమున. 141

గీ. గుణవిభవంబునఁ గౌస్తుభ
మణివలె మాదేవుహృదయమధ్యంబున స
ద్గుణమణివి నీవు నిలిచితి
ప్రీణితింపఁగ వశమె నిన్ను భాషాపతికిన్. 142

క. పరమేశ్వరునకు నీవును
హరిణాంకునిపగిది మౌళియందు ధరింపన్
గర మర్హుండవుగద భూ
వర! నేఁ డల్లుండ వైనభాగ్యముకతనన్. 143

గీ. అపుడు మౌహూర్తికులు వేగ మరుగుదెంచి
దేవ! యాసన్నమయ్యె లగ్నావసరము
కౌతుకగృహంబునకును జామాత నిపుడ
పంపవలయును గాలాతిపాత మేల? 144

వ. అనుటయు. 145

మ. జననాథోత్తముఁ డంప వేడ్కనరిగెన్ జామాతయంతఃపురం
బునకున్ దగ్గనుఁగోలలోచనలసంఫుల్లాక్షిపద్మావళీ

వనజపాత్రితములఁ గ్రమించుచును దద్ద్వారోపకంఠంబునన్
దనతో వచ్చెడివారి నిల్పి నృపకన్యాదర్శనోత్కంఠతన్. 

వ. అచ్చట. 147

చ. చెలులును జుట్టలాప్తులును జేరి తనుం గయిసేయ సంగనా
కులమున రక్తచేల మవగుంఠముగా ధరియించి యావధూ
తిలకము పూర్వసంధ్యవలె దీపకళాతతులన్ గ్రసించుచున్
వెలిఁగె వివాహమంగళపవిత్రవిభాపరిలిప్తమూర్తియై. 148

గీ. నవశిరీషప్రసూనమార్దవశరీర
యగుట సాశంకమయి నవయౌవనంబు
గూడ బాలను గాఢోపగూహనంబు
సేయఁజాలదో ? యన్నట్లు చెలువ మొప్పె. 149

క. ఆసన్నగ్రహణంబును
భాసురరక్తారవిందప్రతిభటమును నై
భాసిల్లుపాణి, రోహిణి
త్రాసంబున శశిని గనువిధంబునఁ గనుచున్. 150

గీ. సాధ్వసనిరుధ్యమానహృత్స్పదననిర్గ
తాయతోచ్ఛ్వాసముల గళితాత్మబాల
భావమును గూర్చి చింతిల్లువగిది నొప్పె
మానినీమణి తత్సతీమండలమున. 151

వ. మఱియుఁ గుముదినీగర్భప్రసూతయుంబోలెఁ జంద్రకధవళతనువల్లియు, వసంతహృదయనిర్గతయుంబోలెఁ గుసుమామోదనిర్హారిణియు, మలయమారుతోత్పన్నయుంబోలె నిశ్వాసపరిమళాకృష్టమధుకరకులయుఁ గౌస్తుభశశిమదిరాపారిజాతామృతప్రభవంబులైనప్రభాలావణ్యమదసౌరభమాధుర్యంబులంగూర్చి సర్వరత్నమయమూర్తిగా సురాసురులయందలికోపంబున రత్నాకరునిచే నుత్పాదింపఁబడిన రెండవలక్ష్మియుంబోలెఁ బ్రకాశించువధూమణిం గాంచె నంత. 152

క. తరుణీసమర్పితుం డగు
వరుని దదీయాంతరంగపాటచ్చరునిఁ
మరుఁ డప్పుడ బంధించెను
వరవర్ణినిగుణవితానపాశావళిచేఁ. 153

క. పరిహాసప్రియ లతివలు
వరు నేయేపనులు సేయఁ బంచిన నతఁడుం
గర మనురక్తిని జేయుచు
సరసీజేక్షణల హర్షజలధిఁ దేల్చెన్. 154

వ. అంత సముచితపరివారసమేతుండై జామాతయు. 155

చ. పరిణయయోగ్యవేషమున భాసిలుకన్నియ కేలువట్టి యా
హరుఁడును బార్వతీసతి హిమాచలశృంగవివాహమందిరాం

తరమున కేగురీతిని సుధాధవళంబయి సర్వభూమిభృ
ద్వరపరివేష్టితం బగువివాహపువేదిక కేగెఁ బ్రీతితోన్.

వ. అదియు నేకసుకుమారయవాంకురదంతురంబులు కోమల
వర్ణచిత్రితంబులు పంచాస్యంబులు నగుసుద్వాహమంగళ
కలశంబులచేతను, ఉపాధ్యాయోపదీయమానేంధనధూ
మాయమానాగ్నిసంధుక్షణాక్షణికోపదిష్టమృద్ద్విజప్రకరం
బులచేతను, ఉపక్ఌప్తశానునిహితానుపహతహారితకుశాంకు
రంబులచేతను, సన్నిహితదృషదజినాజ్యసుక్స్రమిత్సాలీని
వహంబులచేతను, నూతనశూర్పార్పితశ్యామలశమీ
పలాశమిశ్రలాజనివహంబులచేతను నలంకృతంబై యుండె
నప్పుడు. 157

గీ. కౌముదీసహితుండై నకమలవైరి
మింటి కెక్కనకరణి నమేయకాంతి
మహితుఁడై యెక్కె నుద్వాహమండపంబు
లీల గ్రహవర్మ కన్నె కెంగేలు పట్టి. 158

చ. జ్వలదనలప్రభాపటలభాసితశైనవివాహవేదికా
స్థలమున నూత్నదంపతు లుదారత నొప్పి రశోకపాదప
స్థలిఁ జెలువొప్పునున్నరతిశంబరవైరులపోల్కి రాట్సతీ
చలదరవిందసుందరవిశాలదృగంజలిపీతమూర్తులై. 159

గీ. ఆజ్యధారావివర్ధమానాంగుఁ డగుచు
దక్షిణావర్తశిఖలతో దర్శనీయ
మూర్తి యగువీతిహోత్రుని మూఁడుమార్లు
వలగొనిరి నూత్నదంపతుల్ పరమభక్తి. 160

సీ. లాజహోమమున విభ్రాజితనఖదీప్తి
నవదాతవర్ణుఁడై యగ్నిహోత్రుఁ
డాయపూర్వవధూవరాలోకనమున వి
స్మయసస్మితాస్యుఁడో సరణి వెలిఁగెఁ
గన్నియయును సవికారాస్యయై రాల్చె
నశ్రుబిందువులు ముత్యాలపగిది
శుద్ధాంతకాంతలనుస్వరాక్రందన
ధ్వానవిపంచికాస్వనము లొప్పె

గీ. వేడ్క వైవాహికోచితవిధులు దీర్చి
వచ్చి జామాత శ్వశురాంఘ్రిపద్మములకు
సాఁగి మ్రొక్కిన దీవించి చక్రవర్తి
గ్రుచ్చి యెత్తి శిరంబు మూర్కొనియెఁ బ్రీతి.

వ. అంత గ్రహవర్మ సతి కేలు పట్టికొని. 162

సీ. రతిమన్మథులచిత్రరచనావిశేషశృం
గారితద్వారపక్షములతోడ

గంధశైలావసిక్తప్రదీపప్రభా
దీపితరత్నభిత్తికలతోడ
రాధామనోనాథగాథాశతాలంకృ
తము లైనపటవితానములతోడ
భృంగారకుంభశోభితశిరోభాగమా
చారువారణదంతశయ్యతోడ

గీ. భర్మపాంచాలికాహస్తపద్మకలిత
చారుచామరమందసమీరణములఁ
బరిఢవిల్లుమనోహరవాసగృహము
చొచ్చె గ్రహవర్మ వెనుకాడుసుదతితోడ. 163

వ. అంత వనితాజనంబులు నూత్నవధూవరప్రథమసమావేశ
సమయసముచితవినోదంబులఁ గొంతప్రొద్దు గడపి స్వ
కార్యైకతవంబున నిజనివాసంబుల కరుగుటయు వివిక్తం
బైనవాసగృహంబున. 164

ఉ. మోమటుదిప్పి శయ్యపయి ముద్దియ నిద్దురవోవఁ దన్మణీ
ధామవిశాలభిత్తికలఁ దన్మయతం గనుచుం, దదీయల
జ్జామధురావలోకముపనల్ గనఁగోరుచు రాజపుత్త్రిఁ డా
యామినిఁ బుచ్చెనొక్క త్రుటియట్లతిమాత్రకుతూహలంబునన్.

గీ. అత్తమామలచిత్తముల్ హర్షజలధి
వీచికలఁ దేల్చి గ్రహవర్మ వెలఁదితోడ
నపునరుక్తమహార్హభోగానుభూతి
శ్వశురకులమున దశదివసములు గడపె. 166

క. యౌతకధనములతోఁ దన
కూఁతును జామాతఁ గూర్చి కువలయవిభుఁడున్
బ్రీతియు ఖేదముఁ బెనఁగొన
నాతతవైభవ మెలర్ప నల్లునిఁ బంచెన్. 167

వ. ఇట్లనన్యసామాన్యవైభవంబున రాజ్యశ్రీని వివాహంబయి గ్రహవర్మ యిష్టోపభోగంబులఁ దేలుచుండెఁ; బ్రభాకరవర్ధనుండును బరమానందభరితుండయి దుహితృదానంబునం దన్నుఁ గృతకృత్యునిగా భావించుచు సుఖంబుండె. 168



ఉ. మీనశరీర, కచ్ఛప, సుమేరునిభోగ్రవరాహ, మర్త్యపం
చానన, వామనా, భృగుజ, శౌర్యరసాంచితరామ, వారుణీ
పానవివర్ధితాత్మబలభద్ర, మనోహరవల్లవాంగనా
పీనకుచాగ్రగాఢపరిపీడితవక్ష, భవిష్యదాశ్వికా! 169

కం. గంభీరహ్రదసంస్థిత
కుంభీరనిపీడితార్తకుంజరరక్షా
రంభాతుర ! లక్ష్మీకుచ
కుంభపరిష్వంగసక్తకుంకుమవక్షా ! 170

మాలిని. శుభగుణగణవార్ధీ ! సూర్యవంశానువర్తీ !
విభవరుచిరమూర్తీ ! విశ్వవిఖ్యాతకీర్తీ !
ఇభవరభయహర్తా ! యిందిరాప్రాణభర్తా !
క్షుభితదనుకబంధా ! క్షుణ్ణసేతుప్రబంధా ! 171

## —♦ గద్యము. ♦—

ఇది శ్రీకొమాండూరు కృష్ణమాచార్యప్రణీతం బయిన యాంధ్రహర్షచరిత్రం బనుమహాప్రబంధంబునందుఁ జక్రవర్తిజన్మవర్ణనం బనునది చతుర్థాశ్వాసము.



## ప్రథమభాగము సంపూర్ణము.

గుంటూరు చంద్రికాముద్రాశాలయందు ముద్రితము.